1. భక్తియోగ విశేషసంచికను పాఠకులుచూచి చదివి యున్నారుగదా! అందలి లోటుపాట్లను నిస్సంకోచముగ తెలుప ప్రార్థన. ఆ పద్ధతి నచ్చినది లేనిది తెల్పినచో బహుమతమును బట్టి మీదటి సంవత్సరమునకు అనువగు మార్గము నేరు కొందుము.

2. ఆ గ్రంథమే విడిగ కొనువారి సౌలభ్యముకొరకు 'గీతోక్తభక్తియోగ' మనుపేర క్రౌను $\frac{1}{8}$ (వాచకముల) సైజులో ప్రత్యేకముగ ముద్రింపబడినది. కూర్పుతీర్పు రమ్యముగనున్నది. మెకానికల్ గ్లేజుకాగితములు వాడబడినవి. 120 పేజీల గ్రంథము వెల రు. 1–0–0 మాత్రము.

3. గీతావాణి పత్రికలు చేరలేదనియు — పంపవలెననియు వ్రాసెడి ఫిర్యాదులు గీతావాణి మేనేజరుగారికి వ్రాయవల యునేకాని సంపాదకునకు వ్రాయపనిలేదు.

4. వ్యాసములనుకాని, సమీక్షకై పంపు గ్రంథములు పత్రికలుగాని సంపాదకునిపేర ఆళ్లగడ్డకు పంపవలెను. పాత అలవాటుతో కోయిలకుంట్లకుగాని, బనారస్‌కుగాని పంపినచో సంపాదకుడు జవాబుదారీ వహింపడు.

— సంపాదకుడు,

గీతావాణి, ఆళ్లగడ్డపోస్టు (కర్నూలు.)

# గీతావాణి



నాల్గవ సంవత్సరము  ఎనిమిదవ సంచిక

గౌరవ సంపాదకులు: స్వామి శ్రీ శంకరానంద.

## శ్రీ గీతాసాహిత్యసేవాసమితి,

ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

15 ఫిబ్రవరి 1956.

# విషయసూచిక



## లేఖ

సంపాదక మహాశయా!

కాకినాడ,
17—1—55.

ఈ క్రింది విషాద వార్తను తమ పత్రికలో ప్రకటింప ప్రార్థించుచున్నాను.

గీతాచార్యులును అహింసావ్రతులును భాగవతోత్తములును సదాచార సంపన్నులును నగు పండిత శ్రీనోముల అప్పారావుగారు 6_1_55 తేదీన పరమపదించినారు. వారి స్మారక సభ 16_1_55 తేదీన కాకినాడ గోపాలస్వామివారిదేవాలయమున జరిపినాము. హరికథకరత్న బ్ర॥ శ్రీ॥ పసుమర్తి విశ్వపతిశాస్త్రిగారు, గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు, నున్న నారాయణస్వామినాయుడుగారు బి. ఎ., బి. ఎల్., శ్రీ పసుమర్తి శ్రీరామమూర్తిగారు మొదలగు చాలమంది పౌరులు శ్రీఅప్పారావుగారి దివ్యచారిత్రమును గూర్చి మహోపన్యాసములు గావించి పేదలకు అన్నదానమీయబడెను.

శ్రీఅప్పారావుగారు మా భజన సమాజమునకు గత 8 సం॥రం నుంచి అఖండసేవ చేసి సహస్రాధికమంది పౌరులను సన్మార్గమున జొన్పిరి. అట్టివారు మనుష్యుల దుఃఖ సాగరమున నుంచి పరంధామమును జెందిరి. పరమేశ్వరుడు వారి ఆత్మకు నిత్యశాంతి నొసంగుగాక!

చిత్తగించవలెను.

పసుమర్తి శ్రీరామమూర్తి,
కార్యదర్శి – భజనసమాజము,

# "గీతావాణి"

శ్రీ గీతాసాహిత్య సేవాసమితి పక్షమున ప్రకటింపబడు
గీతాతత్త్వ సందేశ మాసపత్రిక.



మేనేజింగ్ ఎడిటర్ :

మేనేజరు:

స్వామి శ్రీశివానంద,

గీతావాణి — ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

సంవత్సరచందా 4—0—0 * విడిపత్రిక 0—6—0

15th FEBRUARY 1955.

# प्रमुख दैनिक "आज" पत्रिका प्रधान संपादक के निधन पर

# ❋ हमारी श्रद्धांजलियाँ ❋

. संपादकाचार्य, साहित्यवाचस्पती एवं हिन्दी पत्रकारिता के गुरुदेव पंडित बाबूराव विष्णु पराडकर जी का देहावसान १३ जनवरी को हुआ।

पं० पराडकर जी सन् १८८६ में पावन काशी क्षेत्र के एक महाराष्ट्र परिवार में अवतरित हुए। पारिवारिक पोषण के लिए उन्हें पहलेपहल डाक और तार विभाग में काम करना पडा। क्या यह संभव है कि अपने स्वतंत्र-भावपरंपराओं एवं स्पष्ट विचारों से संसार को प्रभावित कर सकनेवाला महान व्यक्ति दूसरों के अज्ञात समाचारों का वितरण करनेवाले डाक विभाग में रह सके?

इसी समय इनको कलकत्ताने 'वंगवासी' पत्रिका के सहायक-संपादक के रूप में आमंत्रित किया। संपादन के साथ साथ योगि सम्राट श्री अरविन्द द्वारा स्थापित राष्ट्रीय महा विद्यालय में अध्यापन का कार्य करते रहे, जिस के बाद उन के बुद्धिचातुर्य, महान पांडित्य ने इस योग्य बनाया कि "हितवार्ता" तत्पश्चात 'भारतमित्र' ने अपने संपादन कार्य का भार इन के कन्धों पर रखा।

प्रमुख देश भक्त स्व० श्री शिवप्रसाद जी गुप्त के आह्वान पाकर सन् १९२० में 'आज' दैनिक पत्र के संपादक के रूप में बनारस पधारे। स्वातंत्र्य एवं राष्ट्रीय भावनाओं से प्रदीप्त 'आज' की ज्वालाने अंग्रेजी सरकार को उसे भुझाने विवश किया। फलतः अल्प समय के लिए "आज के समाचार" "रणभेरी" (अज्ञात पत्रिका) के द्वारा अपने अमूल्य राष्ट्रीय भावनाओं को जनता तक पहुँचाया। जिन्हों ने लोगों में राष्ट्रीय जागृति एवं स्वतंत्र-प्रियता का जन्म दिया। प्रतिबन्ध के हटजाने के बाद फिर "आज" के संपादन कार्य करना आरंभ किया और अब तक करते रहे, जिसकी सफलता से हिन्दी संसार एवं साहित्य भली भान्ति परिचित हैं।

ऐसे सुप्रसिद्ध एवं प्रतिभासंपन्न संपादकाचार्य पंडित पराडकर जी के निर्याण से पत्र-कारिता जगत के लिए बहुत क्षति हुई जिसकी कल्पना नहीं कर सकते।

आंध्रप्रांत की पत्रिकाओं की ओर से हमारी 'गीतावाणी' प्रार्थना करती है कि उनकी पवित्र आत्मा को गीताचार्य शान्ति प्रदान करें

श्री काशी विद्यापीठ,

बनारस-२

14—1—1955.

नि. श्रीकण्ठम्

संपादक तथा प्रकाशक, गीतावाणी - (आंध्रा)




సంపుటి 4 ★ స్వస్తిశ్రీ జయ – మాఘమ్ ★ సంచిక 8

# కర్మభక్తిజ్ఞానములు

ప్రపంచములోని మహాపురుషులలో నొక్కొక్కరిని జ్ఞానయోగియనియు, నొకరిని కర్మయోగియనియు లేదా భక్తియోగియనియు మనము వ్యవహరించుచుందుము. అయినను జ్ఞానయోగియని చెప్పబడువానియందు కర్మకాని భక్తికాని బొత్తుగ లేదని చెప్ప వీలులేదు. వారిలో ప్రధానముగ కనబడెడి విశేషగుణమును – విశేషశక్తిని పురస్కరించుకొని మనము వారి నా విధముగ వ్యవహరించుచున్నాము. కేవలము సామాన్య మనుష్యునిలోకూడా కొద్దియొ గొప్పయొ జ్ఞానమును ఉండును; వాడును ఏదో ఒక కర్మమును చేయును; ఆతని హృదయములో అంతో యింతో యెద్దానినో గురించియైనను భక్తిభావమూ ఉండగలదు. అయితే ఈ గుణములు మహాపురుషులలో ఉన్నతస్థాయికిచెంది పరిశుద్ధములై విస్తృతములై వికసించియుండగలవు. వారివద్దనుండెడి జ్ఞానము యేదో తెలివి మాత్రముకాక, వస్తువిచారములో ఆమూలాగ్రముగ పరిశీలించకల్గును. వారి కర్మకౌశల్యము వ్యవస్థాబద్ధమై, పరిణామఫలితమునందు నిశ్చయాత్మక కల్పన కల్గియుండును. ఆ మహాపురుషుల

భక్తి సామాన్యమానవుల భక్తి కంటే విశేషమైనది. ఆభక్తి క్షణికముకాదు. అది స్థాయియై మార్దవమై యుండును.

జ్ఞానకర్మ భక్తులలో ఏ ఒక్కటియైనను ఏ మహాపురుషుని యందు మహోత్తమ వికాసమును పొందియుండునో, అట్టివానియెడ ప్రతివానికి ఆదరబుద్ధి కల్గియే తీరును. ఎవనియందైనను విశేషమైన జ్ఞానశక్తియుండి కర్మశక్తి న్యూనమైయున్నచో, అతడు జ్ఞానమార్గమున వికాసమును పొందియున్నాడని ఊహించవలెను. కర్మ విషయములోను భక్తి విషయములోను అట్లే గ్రహింపవలెను. మానవునియొక్క ఉచ్చతమ వికాసమునకు యీ మూడింటియొక్క సమష్టి సహకారము అక్కరలేదనియు, ఏ ఒక్కదానియొక్క పూర్ణవికాసముచేతనే అట్టిస్థితిపొందవచ్చుననియు కొందరుతలంచుట కలదు. పర్వతశిఖరాగ్రము నెక్కుటకు వివిధమార్గములలో ఏఒక్కటే చాలునుగదా అని వారందురు. ఈ అభిప్రాయమునకు కొన్నిధర్మ గ్రంథములును బలమిచ్చినవి. అయినను విశేషశక్తిధరులై వెలసిన అర్వాచీన ప్రాచీన మహాపురుషుల జీవితములను సమగ్రముగ నవలోకించినచో ఉచ్చతమ వికాసముకొరకు యీమూడింటియొక్క పూర్ణసిద్ధి అవశ్యకమనుమాట చాలమట్టుకు మనకు తోచకపోదు. ఇంతేకాదు. ఒక్కలక్షణమునకు విశేషవికాసము సిద్ధించి తక్కినవి సామాన్యముగనున్నచో ఉచ్చతమస్థితిని చేరనట్లే భావించవలసి యుండును.

భక్తితోతడిసి కర్మమును వీర్యవంతమొనర్పజాలినదియె నిజమైన జ్ఞానము. కర్మవిషయమునుకూడ యిట్లే చెప్పవలెను. జ్ఞానములేని కర్మమునందు కుశలత ఉండదు; వ్యవస్థ ఉండదు; పరిణామఫలితమునుగూర్చిన నిశ్చయాత్మిక బుద్ధి కల్గదు. అట్టికర్మతో భక్తి మేళవించనిచో అచ్చట దురభిమానమును ఉగ్రసంరంభమును బలిసిపోవును. భక్తివిషయమునకూడ ఇదేపద్ధతి. భక్తుడు సర్వసమర్పణముచేసియున్నాడు. కాబట్టి ప్రకృతి సహజముగ వాని

కర్మలు సాగిపోవుచునేయుండును. ఈశ్వరానుగ్రహముతో వానికి జ్ఞానముకూడ లభించును. వాని సర్వసమర్పణభావము తాను పొందిన జ్ఞానమునకు తగిన గుర్తైయుండగలదు.

దేహమునందు జీవనశక్తియున్నంతవరకు ఆశక్తి ప్రతి అంగమునందును వ్యాపించియుండును. సర్వావయవములు సమాన శక్తివంతములై కార్యాచరణ దక్షములై యున్నచో, అట్టివాడె ఆదర్శమైన ఆరోగ్యవంతుడుగ పరిగణింపబడును. అవయవము లందొకదానిశక్తి తీవ్రమై మరొకటి మందగించినచో ఆరోగ్యస్థితికి లోపమనియె చెప్పవలయును. ఆత్మయొక్క — హృదయము యొక్క పూర్ణారోగ్యసిద్ధికొఱకు జ్ఞాన కర్మభక్తుల మూడింటి వికాసము సమానముగ నుండవలెను. అటుగాక, ఏ ఒక్కదాని వికాసమునే లక్ష్యముగ పెట్టుకొనినవానిని సమగ్రముగ నవలోకించినచో, ఆ వ్యక్తిత్వమున కొన్నిలోపములు గోచరము కాకపోవు.

జ్ఞానము అకర్మణ్యతకు దారితీసినచో, తెలిసికొన్న తర్వాత ఏమియుచేయకయున్నచో, ఆ శుష్కజ్ఞానమువలన డంబమును మిథ్యాభిమానమును కల్గెడి ప్రమాదమున్నది. అట్లే కర్మయందు నిరంతరము సతమతమగువాడు, మహత్త్వాకాంక్షిగ పరమరాజసికుడుగ పరిణమింపవచ్చును. భక్తికితోడై జ్ఞానకర్మములు లేనిచో అచ్చట జడత్వమును అమాయికత్వమును సంప్రాప్తించకపోవు. జ్ఞానమును శుద్ధమొనర్చుటకు జ్ఞానబలమును ఒఱచిచూచుకొనుటకు కర్మతో పనివున్నది. నమ్రతలేక జ్ఞానము లభించదు కాబట్టి భక్తి కూడ ఆవశ్యకమే. జ్ఞానసహాయములేని కర్మము భయంకరమై తుపానువలె యెందైన నూకివేయును. జ్ఞానభక్తి శూన్యమైన కర్మయందు అభిమానమును అపేక్షలును నిండియుండును. జ్ఞానకర్మలతోకూడని భక్తి, అంధశ్రద్ధకు — వట్టిమూఢాచారములకు దారితీయును. వ్యక్తి యొక్కయు సమాజముయొక్కయు సర్వతోముఖ వికాసముకొరకు జ్ఞానకర్మభక్తులనెడి త్రిపుటియొక్క సమానవికాసము ఆవశ్యకము.

("అఖండానంద" )




[ గత సంచిక 11-వ పుట తరువాయి. ]

"తత్త్వమసి" మహావాక్య శ్రవణమున వివేకికి బ్రహ్మాత్మ సాక్షాత్కార మెప్పుడు సిద్ధించుచున్నదో, అప్పుడే అవిద్య సంపూర్ణముగ నివర్తించుచున్నది. అనాదియు సాంతమునునగు అవిద్య ఒక్కసారి నశించినచో మరి సంభవించుటకు వీలులేదు. అట్టియెడ అవిద్యాకార్యములగు మహత్తత్త్వాదికములును నివృత్తియగుచున్నవి. ఆయెడ బాధాపూర్వకమగు నిర్జీవసమాధి యేర్పడుచున్నది. ఆ విషయమునె భగవంతుడు ఈ శ్లోకమున బోధించియున్నాడు.

జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు వెరశి పదింటిని బాహ్యేంద్రియములందురు. మనోబుద్ధుల రెంటిని అంతరింద్రియములందురు. ఈ బాహ్యాంతరిక సర్వేంద్రియములకు సంబంధించి స్థూలరూపములును సూక్ష్మరూపములును నగు కర్మము లనేకవిధములు. శబ్దమును వినుట శ్రోత్రేంద్రియ కర్మము. స్పర్శను గ్రహించుట త్వగింద్రియ కర్మము. రూపమును చూచుట నేత్రేంద్రియ కర్మము. రసమును గ్రహించుట జిహ్వేంద్రియ కర్మము. గంధము నాఘ్రాణించుట ఘ్రాణేంద్రియకర్మము. ఇంతమట్టుకు జ్ఞానేంద్రియముల యొక్క కర్మములు. అట్లే కర్మేంద్రియముల పనులుకూడ. వాగింద్రియము మాటలాడును. హస్తము వస్తువును గ్రహించును. పాదము గమనాగమనములను చేయును. ఉపస్థేంద్రియము విషయానందము ననుభవించును. పాయ్వింద్రియము మలవిసర్జన మొనర్చును. ఇవి అయిదును కర్మేంద్రియముల పనులు. మనస్సు సంకల్పించును, బుద్ధినిశ్చయించును. ప్రాణవాయువు బాహ్యాగమన మొనర్చును. అపానవాయువు అధోగమనము చేయును. వ్యానవాయువు హస్తపాదాదికములయొక్క ఆకుం

చన ప్రసారణములకు అవకాశ మిచ్చును. తినిన అన్నపానీయము లను సర్వాంగములకు తగినట్లు సమ ముగ పంచియిచ్చుట సమాన వాయువుయొక్క పని. ఊర్ధ్వగమ నము ఉదానవాయు కర్మము. పైన చెప్పిన జ్ఞానేంద్రియములైదు, కర్మేం ద్రియములైదు, ప్రాణములైదు, అంతరింద్రియములు రెండు మొత్త ము పదియేడు తత్వముల సంపుటిని లింగశరీరమందురు. సూక్ష్మభూత సమష్టిరూపుడగు హిరణ్యగర్భుడీ లింగశరీరమునకు వివక్షితుడు. కొం దరు వివేకులు యీ లింగశరీరమును ఆత్మ సంయమమనెడి యోగాగ్ని యందు హోమముచేయుచున్నారు.

ఈ ఆత్మ సంయమయోగాగ్ని జ్ఞానదీపితమై యుండునది. వేదాంత వాక్యములవలన జనించి బ్రహ్మా త్మైక్య సాక్షాత్కార ద్వారమున కార్యసహితముగ అవిద్యను విధ్వం సము చేసి జాజ్వల్యమానమై వెలు గొందునదని అర్థము. జ్ఞానదీపితమగు యిట్టి ఆత్మసంయమయోగాగ్ని యనెడి బాధాపూర్వక సమాధి యందు వివేకులగు కొందరు సమష్టి లింగశరీరమును హోమము చేయు చున్నారు.

ముందటి యిర్వదియెన్మిదవ శ్లోకమున భగవంతుడు ఆరువిధము లగు యజ్ఞముల నుపదేశించు చున్నాడు.

"అర్జునా! అధికారులగు కొం దరు ద్రవ్యత్యాగమనెడి యజ్ఞ మును, కొందరు తపస్సనెడి యజ్ఞ మును, కొందరు యోగమనెడి యజ్ఞమును, మరికొందరు వేదా భ్యాసమనెడి యజ్ఞమును, కొంత మంది జ్ఞానమనెడి యజ్ఞమును చేయుచున్నారు. యత్నశీలురగు మరికొందరు అత్యంత దృఢవ్రత మనెడి యజ్ఞము నాచరించు చున్నారు."

శాస్త్రవిధి ననుసరించి సుకృత ముగ డబ్బును వెచ్చించుట ద్రవ్య యజ్ఞము. పూర్తము దత్తమనెడి స్మార్తకర్మములను చేయుట యీ శ్రేణిలోనికి చేరును. వాటి వివర ణము స్మృతిగ్రంథములందిట్లు చెప్ప బడినది.

శ్లో॥ వాపీకూపతటాకాది
దేవతాయతనాని చ।
అన్నప్రదానమారామః
పూర్త ఇత్యభిధీయతే॥
శరణాగత సంత్రాణం
భూతానాం చాప్యహింసనం।
బహిర్వేది చ యద్దానం
దత్తమిత్యభిధీయతే॥

తా॥ బావిని కోనేటిని చెరు వును దేవాలయమును తోపును ధర్మశాలను నిర్మించుట, ఆకలి గొన్నవారికి అన్నము పెట్టుట పూర్తమని చెప్పబడును. శరణా గతులను రక్షించుట, భూతప్రాణు లను హింసింపకుండుట, దానము చేయుట దత్తకర్మలందురు. ఇట్లు పూర్తదత్తములనెడి స్మార్తకర్మము లనగాక యిష్టమనెడి శ్రౌత కర్మ మును చేయుటకూడ ద్రవ్యయజ్ఞ మనియే చెప్పబడును.

కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రత నియమములను తపోయజ్ఞములం దురు. అట్టివాటి నాచరించువారు తపోయజ్ఞపరులు.

చిత్తవృత్తులను నిరోధించుట యోగయజ్ఞము. కొందరు అష్టాంగ యోగము నభ్యసించి యోగయజ్ఞ పరులగుచున్నారు. యమనియమా సన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యానసమాధులని యోగ ము యెనిమిది విధములు. అందు ప్రత్యాహారమును గురించి "శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే" — అనెడి శ్లోకమున వివరించితిమి. ధారణధ్యాన సమాధులనుగురించి, "ఆత్మ సంయమయోగాగ్నౌ" — అనెడి శ్లోకసందర్భమున వివరించి తిమి. ప్రాణాయామముయొక్క స్వరూపమును "అపానే జుహ్వతి ప్రాణ" మనెడిచోట వివరించితిమి. కావున యిప్పుడీచోట యమనియమ ములను గూర్చి విమర్శించెదము.

అహింసా సత్య అస్తేయ బ్రహ్మ చర్య అపరిగ్రహములనెడి అయిదు అంగములతోకూడినది యమము. అందు, అహింసయనిన వాక్కుతో మనస్సుతో శరీరముతో యేప్రాణిని కూడ హింసింపకుండుట. హింస యనునది కృత — కారిత — అను మోదితములని మూడువిధములు. మానవుడు స్వయముగ తనచేతు లార చేసిన హింసను కృతమందురు. మరొక్కరి మూలముగ చేయించిన హింసను కారితమందురు. హింసా కార్యమునందు తన సమ్మతిని ప్రద ర్శించుట అనుమోదితమందురు. ఇట్లు త్రివిధరూపమగు హింసనుండి నివృత్తిపొందుట అహింసయని చెప్పబడును.

అసత్యమును పల్కుట, అయు క్తమగు చోట ఛలకపటద్రోహ యుక్తముగ మాటలాడుట, ఈ రెండుపద్ధతులను వదలుటను 'సత్య' మని చెప్పుదురు.

అశాస్త్రీయముగ పరద్రవ్యము నపహరించుటను 'స్తేయ'మందురు. ఆవృత్తి లేకుండుట అస్తేయము.

వీర్య రక్షణమును బ్రహ్మచర్యమందురు. నిషిద్ధమగు స్త్రీ పురుష సంబంధమును త్యజించుటకు బ్రహ్మచర్యమని పేరు. శరీరయాత్రకు తగినమట్టుకె గాక మితిమీరి భోగ సామగ్రులను చేకూర్చుకొనుట పరిగ్రహమందురు. ఆవృత్తి లేకుండుటను 'అపరిగ్రహ' మందురు. ఇంత మట్టుకు యమముయొక్క స్వరూపము.

శౌచ సంతోష తపస్స్వాధ్యాయ ఈశ్వర ప్రణిధానములనెడి అయిదు అంగములతో కూడినది నియమము. అందు శౌచము బాహ్యమని అంతరమని రెండు విధములు. మృత్తిక చేతను జలముచేతను శరీరమును నిర్మలమొనర్చుకొనుటయు, హితము మితము భక్షణయోగ్యమునగు అన్నాదికములను భుజించుటయు బాహ్యశౌచమనిపించుకొనును.

'మైత్రి ముదితా కరుణా ఉపేక్ష లనెడి గుణములచేత చిత్తమాలిన్య వికారములను నివృత్తిచేసికొనుట ఆంతర శౌచ మనిపించుకొనును. మైత్రియనిన సుఖముగ బ్రతుకు ప్రాణులయందు మిత్రభావముంచుట. పుణ్యాత్ములనుచూచి సంతోషించుట ముదితయందురు. దుఃఖార్తులగువారినిచూచి కనికరించుటకు కరుణయని పేరు. పాపాత్ముల యొక్క దుష్టులయొక్క సాంగత్యమును వదలి దూరమైవుండుట ఉపేక్ష.

ఇంకను యింకను కావలెననెడి పేరాసను వదలి తనకు ప్రాప్తించిన భోగసాధనములతో తృప్తివహించుట సంతోషమందురు. ఆకలి దప్పులు — శీతోష్ణములు మున్నగు ద్వంద్వములను సహించి, కాష్ఠమౌన ఆకార మౌనాదివ్రతముల ననుష్ఠించుట తపమని చెప్పుదురు.

హస్తపాదాది అవయవ చేష్టల చేతనుకూడ అభిప్రాయమును ప్రకటింపకుండుటను కాష్ఠమౌనమందురు. అవయవముల సైగలతో అభిప్రాయమును వ్యక్తపరచుచు నోటితోమాత్రము మాటలాడకుండుటను ఆకార మౌనమందురు.

మోక్షమును ప్రతిపాదించెడి వేదాంత శాస్త్రములను అధ్యయనము చేయుటయు లేదా ప్రణవ మంత్రమును జపమొనర్చుటయు స్వాధ్యాయమని చెప్పుదురు.

( మిగత 12 వ పుటలో )

# ★ మనకర్తవ్యం ★

రచయిత:— కె. సచ్చిదానందమూర్తి, ఆంధ్ర యూనివర్సిటీ.

★

[ కె. సచ్చిదానందమూర్తిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయ తత్త్వశాస్త్రోపన్యాసకులు. వారు ఈమధ్యే పశ్చిమఖండాలల్లో పర్యటించుటకువెళ్లారు. ఈ చిన్నివ్యాసాన్ని లండన్ నుండి వ్రాసిపంపారు. వేలకొలది మైళ్లదూరంలో వుండికూడా గీతావాణియెడ తమ అవ్యాజ ప్రేమాభిమానములను ప్రకటించిన ఆ సహృదయునకు మా కృతజ్ఞతాంజలులు.
సంపాదకుడు.]

నేనీ లఘువ్యాసాన్ని లండన్ నుంచి వ్రాస్తూన్నాను. మాసత్రయంగా యూరోప్‌లో పర్యటిస్తూన్నాను, విఖ్యాత విశ్వవిద్యాలయాలు చూడడం, జాస్పర్స్ — యూంగ్ — రస్సెల్ వంటి ప్రముఖ తత్త్వవేత్తలతో చర్చలు జరపటం, కొన్నిచోట్ల ఉపన్యసించటం, పాశ్చాత్య సంస్కృతిని అవగాహన చేసుకోటం చేస్తూన్నాను. యూరోప్ పర్యటనానంతరం హిందూసంస్కృతిని ప్రేమించేవారు పురాతన హిందూ గ్రంథాలను ప్రేమించేవారు చేయదగిన పనులు కొన్ని వున్నవని నాకు మరీ స్పష్టంగా తోచినది.

1. ఏ మతమైనా ప్రమాణ గ్రంథాలపై ఆధారపడక మానదు. హిందూమతానికి ప్రమాణగ్రంథాలు శ్రుతులు, స్మృతులు. స్మృతులుగా బాదరాయణ — జైమిని — కుమారిల భట్టులు రెండు గ్రంథాలనే పాటించారు. ఒకటి మనుస్మృతి. రెండు మహాభారతాంతర్గత గీత. ఇతరస్మృతులు లేవని వారనలేదు.



కాని వాటిని అంతగా అంగీకరించినట్లు కనబడదు. బ్రహ్మసూత్రాలలో "స్మృతి యిలా వున్నది" అంటూ గీత పేర్కొనబడ్డది. ఇతిహాస పురాణాలు పూర్ణప్రమాణ

గ్రంథాలుగా జైమిని కుమారిలులు అంగీకరించలేదు; కాని వాటిని కూడ స్మృతులక్రిందే చేర్చాడు కుమారిలుడు. ఇతిహాస పురాణాల లోని రకరకాల కథలు వాస్తవంగా జరిగినవి కావనిన్నీ — అవి కేవలం, 'స్థూలం సూక్ష్మంనుంచి ఆవిర్భ విస్తుంది.' — 'ప్రాపంచిక భోగాలు శాశ్వతం కావు.' — 'మనుష్య ప్రయత్నంకంటే విధి బలీయం' — ఇత్యాది నీతులను బోధించటానికే ఆ కథలనిన్నీ కుమారిల భట్టు తంత్రవార్తికంలో స్పష్టంచేశాడు. అంటే పంచతంత్రంలోని కథలెంతో యితిహాస పురాణాలలోని కథలూ అంతేనని కుమారిలుని అభిప్రాయం.

2. అయితే వేదంలో కథలు లేవా అంటే ఉన్నవి. అవి ఏలా అర్థంచేసుకోవాలి? మనకు యేది ప్రత్యక్షంగా చూడడానికి వీలవు తుందో లేక యేది అనుమానం చేత గ్రహించటానికి వీలవు తుందో, దాన్నిగూర్చి చెప్పటానికి శాస్త్రం మేర్పడలేదు. శాస్త్రం సైన్సుకాదు; మరి హిస్టరీన్నికాదు. అందుచేత శాస్త్రగ్రంథాలల్లో ఎక్క డైనా ప్రత్యక్షానికి విరుద్ధమైన వాక్యాలుంటే వాటిని గుణవాదా ల్లుగా పరిగణించాలి. ఉదాహరణకు "ఈ యూపం సూర్యుడు" — అని శ్రుతి ఒకచో అన్నది. అంటే ఇక, యూపం — ఒక యజ్ఞస్తంభం సూర్యుడై కూర్చుంటుందా? ఆచార్య శంకరులు అన్నట్లు వంద శ్రుతివాక్యాలు ఆలా అన్నా నిప్పు చల్లగాకాదు. వాచస్పతి చెప్పినట్లు, నూరు వేదాలు చెప్పనీయండి — కుండ గుడ్డకాదు. కాబట్టి యిలాటి వాక్యాలువచ్చినపుడు వాటిని వేరే విధంగా అర్థంచేసుకోవాలి. యూపాన్ని ప్రశంసించటానికే యీ వాక్యంకాని యథార్థాన్ని వర్ణించ డానికి కాదు. అల్లే ఉపనిషత్తులలో ప్రపంచం ఎలా ఏర్పడ్డది అనే విష యాన్ని గూర్చి నానా రకాలుగా చెప్పబడ్డది. ఎందుకంటే, ప్రపంచం ఎలా ఏర్పడ్డది అని చెప్పేపని ఉపని షత్తులదికాదు; అంటే శాస్త్ర గ్రంథాలదికాదు. ఆ పని చేయాల్సింది సైన్సు. అయితే శాస్త్రగ్రంథం ఏంచేస్తుంది. మోక్షానికి కావాల్సిన జ్ఞానం యిస్తుంది. అందుచేత సృష్టి ప్రక్రియను యిష్టమొచ్చినట్లున్ను బహుశా పరస్పర విరుద్ధంగాన్ను వర్ణించినవి శ్రుతులు. ఆ వర్ణనలన్నీ నిజం అనుకోవటం తెలివితక్కువ. (శంకరులు సూత్రభాష్యం I. IV. 14, 15 లో యీలాగే అన్నారు.)

ప్రత్యక్ష విరుద్ధములైన విషయాలు అనుమాన —అంటే హిష్టరీ సైన్సులకు విరుద్ధములైన విషయాలు శ్రుతిస్మృతులలోవున్నవి. వాటన్నిటిని నిజంగాతీసుకోగూడదు. అలాటి వాక్యాలువచ్చినపుడు వాటిని గుణవాదాలుగానో, లేక మరో అర్థంలోనో తీసుకోవాలి. కొన్నిచోట్ల శాస్త్రాల్లో మనమెరిగిన సంగతులు "మంట చలిని పోగొట్టుతుంది" యిత్యాదులున్నవి. వీటిని చెప్పటానికికూడ శాస్త్రాలేర్పడలేదు. మరి కొన్నిచోట్ల "ఇంద్రుడు వృత్రుని మీదికి వజ్రమెత్తాడు" ఈలాంటి వాక్యాలున్నవి. ఇవి ప్రత్యక్ష అనుమానాలకు విరుద్ధంకావు; అయితే ఏది ఎత్తితే మనకేం ప్రయోజనం? కాబట్టి అలాటి వాక్యాలు స్వతః తాత్పర్యవంతములు కావు. ఎందుకంటే — అవి మనకు ధర్మాన్ని చెప్పవు. మోక్షసంబంధ జ్ఞానాన్ని యివ్వవు. మనం ఎలా జీవితంలో నడచుకోవాలి, ఏఏపనులుచేయాలి అని చెప్పటానికి శాస్త్రం అంటూ జైమిని అభిప్రాయం. అదేకాకుండా బ్రహ్మమునుగూర్చి చెప్పేవాక్యాలు కూడా శాస్త్రములోని ముఖ్యభాగాలే. ఎందుకంటే బ్రహ్మజ్ఞానము మోక్షానికి ఆవశ్యకం గాన. నిజంగా శాస్త్ర తాత్పర్యము బ్రహ్మమును యెఱుక పరచటమే; బ్రహ్మము ప్రత్యక్ష అనుమానముల ద్వారా తెలుసుకోబడదు కాబట్టి — అని బాదరాయణుని అభిప్రాయం.

జైమిని బాదరాయణులు — కుమారిల శంకరులు సూచించిన సూత్రాల అనుసారంగా మనశాస్త్ర గ్రంథాలనుఅర్థంచేసుకోవటంప్రథమ కర్తవ్యం. కుమారిలుని సూత్రం అంగీకరిస్తే శాస్త్రంను demythologise చేయవచ్చు. శంకరుల సూత్రం అనుసరిస్తే Spiritualise చేయవచ్చు.

---

(8-వ పుట శేషము)

సర్వవిధములగు ఫలాపేక్షలను వదలి సమస్తకర్మములను పరమ గురువగుఈశ్వరునకుసమర్పించుటను "ఈశ్వర ప్రణిధాన" మందురు. యోగశాస్త్ర పద్ధతినిబట్టి యమ నియమములు వివరించితిమి.

యోగయజ్ఞమును చెప్పినపిదప భగవంతుడు స్వాధ్యాయయజ్ఞమును చెప్పుచున్నాడు. అధికారులగు వారు విధిపూర్వకముగ గురుసన్నిధిని చేరి నియమపూర్వకముగ ఉపనిషత్తుల నభ్యసించుటకు స్వాధ్యాయయజ్ఞమని పేరు.



(సశేషము)

# సానువాదశంకరభాష్యసమలంకృతము
## శ్రీమద్భగవద్గీత
అనువాదకులు
## శ్రీ స్వామి శుద్ధచైతన్య జీ.

(1954 అక్టోబరు సంచిక 26 వ పుట తరువాయి)



భా.— కిం పునః తదసత్ యత్ స్వాత్మసత్తాం వ్యభిచరతీత్యుచ్యతే —

అను:— ఎయ్యది స్వసత్తానాశము (తన యునికిని గోల్పోవుట) నొందు చున్నదో, ఆ యసద్వస్తువింకను ఎట్టిదయియున్నదియు జెప్పు చున్నాడు —

శ్లో॥ అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః ।
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥ 18

భా:— అన్తవన్తః అన్తో నాశో యేషాం తేఽన్తవన్తః యథా మృగతృష్ణికాదౌ సద్బుద్ధిరనువృత్తా ప్రమాణనిరూపణాన్తే విచ్ఛిద్యతే స తస్య అన్తః తథా ఇమే దేహాః స్వప్నే మాయాదేహాదివచ్చ అన్తవన్తః నిత్యస్య శరీరిణః శరీరవతః అనాశినః అప్రమేయస్య ఆత్మనః అన్తవన్తః ఇత్యుక్తాః వివేకిభిః ఇత్యర్థః.

అను:— అంతము అనగా నాశము వేనికిగలదో అవి అంతవంతములు. ఎట్లన, మరుమరీచిక (ఎండమావి) మున్నగుదానియందు సద్బుద్ధి అనువర్తించినదై ప్రమాణముచే నిరూపణమైనవెనుక (ఆసద్బుద్ధి) విచ్ఛేదమునొందు (లేకపోవు) చున్నది; ఇయ్యది దానికి అంతమగును. అట్లే నిత్యుడును శరీరియు (త్రిభువనములలోని భూత భవిష్యద్వర్తమానరూపములైన సమస్తశరీరములను అంతర్యామిగానుండి ధరించుచున్నట్టివాడును) అనాశియు (నాశము లేనివాడు)ను అప్రమేయుడును (ప్రమాణములచే నెఱుగబడని వాడును) అగు ఆత్మయొక్క యీ దేహములు (బ్రహ్మాండమునగల సకలదేహములు) స్వప్నమునందు మాయా (నిద్రా

దోషముచే గలిగిన) దేహములువలెనే అంతము* గలవిగా వివేకులచేత జెప్పబడినవని యర్థము.

భా:- నిత్యస్యానాశిన ఇతి న పౌనరుక్త్యం నిత్యత్వస్య ద్వివిధత్వాత్ లోకేనాశస్య చ. యథా దేహః భస్మీభూతః అదర్శనంగతః నష్టః ఇత్యుచ్యతే. విద్యమానోఽపి వయసా పరిణతః వ్యాధ్యాదియుక్తః జాతః నష్టః ఇత్యుచ్యతే. తత్ర అనాశినః నిత్యస్య ఇతి ద్వివిధేనాపి వినాశేన అసంబన్ధస్య ఇత్యర్థః. అన్యథా పృథివ్యాది వదపి నిత్యత్వం స్యాత్ ఆత్మనః తత్ మాభూత్ ఇతి. నిత్యస్య అనాశినః ఇత్యాహ.

అను:-"నిత్యము" "అనాశి" యనునీపదములు పునరుక్తిగలవి కావు. ఏలన లోకమున నిత్యత్వము, నాశము రెండువిధములుగా నున్నవి. ఎట్లన, దేహము భస్మీభూతమై కానరాకుండపోయి నశించినది అని చెప్పబడుచున్నది. దేహముఉండికూడ వయస్సు చేత పరిణామమునొందినదై రోగాదులతో గూడినదై నశించినది. (కృశించినది)అని చెప్పబడుచున్నది. ఇట "అనాశి" "నిత్యము" అనిచెప్పి యీ రెండువిధములైన నాశముతోను ఆత్మసంబంధము లేనిదిగా తెలియజేయబడినదని యర్థము. అట్లు కానిచో భూమి మున్నగువాని నిత్యత్వము (ప్రళయమువఱకే ఉండునట్టి నిత్యత్వము) వంటిదే ఆత్మయొక్క నిత్యత్వముగూడ అగును. ఇట్టి భావమును నిరాకరించుటకై "నిత్యము" "అనాశి" యని భగవానుడు చెప్పుచున్నాడు.

భా:- న ప్రమేయస్య అప్రమేయస్య ప్రత్యక్షాదిప్రమాణైః అపరిచ్ఛేద్యస్య ఇత్యర్థః. నను ఆగమేన ఆత్మా పరిచ్ఛిద్యతే ప్రత్యక్షాదినా చ. న పూర్వం స్వతః సిద్ధత్వాత్ సిద్ధే హి ఆత్మని ప్రమాతరి ప్రమిత్సోః ప్రమాణాన్వేషణా భవతి నహి ప్రమాతు మిచ్ఛన్ పూర్వమిత్థం నిత్యః అవిక్రియః చ ఆత్మా అహమితి ఆత్మానం ప్రమాయ పశ్చాత్ ప్రమేయపరిచ్ఛేదాయ ప్రవర్తతే. నహి ఆత్మానామ కస్యచిత్ అప్రసిద్ధః భవతి.

* ఎండమావియందు ఇది జలము అనెడిబుద్ధి ప్రమాణనిరూపణముచే తొలగిపోవుచున్నది. అట్లే యీ దేహములును ప్రమాణములచే నిరూపణముచేయగా (విచారించి చూడగా) పంచభూతమయములుగా లేదా బ్రహ్మమాత్రములుగా (స్వతః సత్తలేనివిగా) పర్యవసానము నొందుచున్నవని యభిప్రాయము.

అను:-(మఱియు) ఆత్మ అప్రమేయమైనది. ప్రమేయము* కానిది అప్రమేయము. ప్రత్యక్షాది ప్రమాణములచేత♦ అపరిచ్ఛేద్య† మని యర్థము. ఓయీ! శాస్త్రముచేతను, ప్రత్యక్షాది ప్రమాణముచేతను ఆత్మ పరిచ్ఛేద్యమగుచున్నదిగదా? యనిన, అటుల కాదు. ఏలన, ఆయాయి ప్రమాణములద్వారా పరిచ్ఛేద్యముగా జేసికొనుటకుముందే స్వతస్సిద్ధమయి ఆత్మ విరాజిల్లుచు ఉన్నది. ప్రమాత§ యైన ఆత్మ (తాను) సిద్ధమై యుండగానే ప్రమిత్సువు¶ నకు (తనకు) ప్రమాణములను గురించిన అన్వేషణ (వెదకుట — ఆయాయివిషయములను గోచరింపజేసికొనుటకు ప్రయత్నించుట) సంభవించుచున్నది. ఆయాయి విషయములను గ్రహింపగోరుచున్నవాడు మొదట, నిత్యమును అవిక్రియము‡ నగునిట్టి యాత్మను నేను అని ఆత్మను చూచుకొని తరువాత ఆయాయి విషయములను గ్రహించుటకు ప్రవర్తించుటలేదుగదా. ఏలయన, ఆత్మయనునది ఎవ్వనికిని అప్రసిద్ధముగాదు. (తన యొక్క ఉనికి తనకు తెలియకుండ ఉండునట్టివాడు ఎవ్వడును లేడనిభావము.)

భా:- శాస్త్రంతు అన్త్యం ప్రమాణం అతద్ధర్మాధ్యారోపణమాత్రనివర్తకత్వేన ప్రమాణత్వం ఆత్మనః ప్రతిపద్యతే న తు అజ్ఞాతార్థజ్ఞాపకత్వేన తథాచ శ్రుతిః “యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ య ఆత్మా సర్వాన్తరః” ఇతి.

అను:- శాస్త్రము పరమప్రమాణమే; (ఏ విషయమున?) అనాత్మ-(ఆత్మ కాని దేహాము మున్నగువానియొక్క) ధర్మములు ఆత్మయందు ఆరోపితము లయియున్నవి; అట్టి ఆరోపితధర్మములను మాత్రమే

---

* విషయ (గోచర) మగునది. ♦ నేత్రాది-ఇంద్రియములచేత. † పరిచ్ఛేదము నొందింపరానిది - ఇట్టిది అట్టిదిఅని పరిమాణముగలదిగా చేయుటకు శక్యము గానిది-గోచరింపజేసికొనరానిది. § ప్రమాత - ప్రత్యక్షాది ప్రమాణములద్వారా ఆయాయి విషయముల నెఱిగెడివాడు. ¶ ప్రమిత్సువు—ప్రమాత కాగోరినవాడు — ఎఱుగగోరినవాడు. ‡ అవిక్రియము — ఎన్నడును ఎక్కడను ఏవిధమైన వికారములను పొందనట్టి స్వరూపస్వభావములుగలది.

నివ_ర్తింపజేయునదగుటచేత ఆత్మకు (ఈ విషయమై) శాస్త్రము ప్రమాణముగా నుండునట్టిస్థితిని పొందుచున్నది; అంతియేకాని అజ్ఞాతార్థమును (బొత్తిగా తెలియబడకయున్న ఆత్మను) తెలియ జేయునదగుటచే మాత్రముకాదు. "ఎయ్యది సాక్షాత్తు అప రోక్షమో (స్వయంప్రకాశమో) అయ్యది బ్రహ్మము; ఎయ్యది బ్రహ్మమో అదియే సర్వాంతర (సకలభూతములలోపలనుండు నట్టిది) యైన ఆత్మ" అని శ్రుతియు నిట్లే వక్కాణించినది.

భా:– యస్మాదేవం నిత్యః అవిక్రియః చ ఆత్మా తస్మాత్ యుధ్యస్వ యుద్ధాత్ ఉపరమం మా కార్షీః ఇత్యర్థః. న హి అత్ర యుద్ధం క_ర్తవ్యతయా విధీయతే. యుద్ధే ప్రవృ_త్తః ఏవ హి అసౌ శోకమోహప్రతిబద్ధః తూష్ణీం ఆ_స్తే తస్య ప్రతి బన్ధాపనయనమాత్రం భగవతా క్రియతే. తస్మాత్ యుధ్యస్వ ఇతి అనువాదమాత్రం న విధిః. శోకమోహాదిసంసారకారణనివృ_త్త్యర్థం గీతాశాస్త్రం న ప్రవ_ర్తకం ఇతి అర్థః.

అను:– ఏ హేతువుచేత ఆత్మ నిత్యము, అవిక్రియము నై యున్నదో, అందు వలన యుద్ధము సేయుము. యుద్ధమునుండి విరమింపకుమని యర్థము. ఇట యుద్ధము క_ర్తవ్యముగా విధింపబడుటలేదు. ఎట్లన, యుద్ధమున ప్రవృత్తుడయియేయున్న యీ యర్జునుడు శోకమోహములచేత ప్రతిబంధింపబడినవాడై (అడ్డగింపబడి) ఊరకుండెను. వీనియొక్క యీ ప్రతిబంధమును తొలగించుట మాత్రమే భగవానుడు చేయుచున్నపని. అందువలన "యుద్ధము సేయుము" అను నీ మాట అనువాదము (పూర్వమే ఉన్నదాని ననుసరించి పలుకుట) మాత్రమే కాని విధికాదు. గీతాశాస్త్రము శోకమోహాది సంసారకారణముల నివ_ర్తింపజేయుటయే ప్రయో జనముగా గలదిగాని ప్రవ_ర్తింపజేయునదిమాత్రముకాదు అని అర్థము.

(సశేషము)



# శ్రీ భగవద్గీత
# మాధ్వభాష్యానువాదము

విద్వాన్ – శ్రీ ఘూళీ కృష్ణమూర్త్యాచార్యులు, బళ్ళారి.

(గతసంచిక 24వ పుట తరువాయి)

"దుర్యోధనా! మావంక వీరులే లేరా" అన్నచో చెప్పుచున్నాడు:

శ్లో॥ అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే ॥ 7

తా॥ బ్రాహ్మణోత్తమ! మావీరులను వారి బలతారతమ్యములను చెప్పుచున్నాను వినుము.

వి॥ బ్రహ్మతేజోబలమే బలముగనుక మీరే మమ్ము శాసింపను, కాపాడను అర్హులని చెప్పుచున్నాడు.

శ్లో॥ భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తిస్తథైవ చ ॥ 8

తా॥ జయశాలులగు మీరు (ద్రోణుడు), భీష్ముడు, కర్ణుడు, కృపుడు, అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రవుడు మొదలగువారు మావీరులు.

వి॥ వీరులను ఎంచునపుడు మాకు ధైర్యము సన్నగిల్లుచున్నది. మావంక శూరులు తక్కువ. ఎందరు వీరులున్నారనుకొన్నను మనకు జయము సున్నయని పలికి భవితవ్యతను సూచించుచున్నాడు.

శ్లో॥ అన్యే చ బహవః శూరా మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్రప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ 9

తా॥ శల్య, భగదత్త, కృతవర్మాదులగు వీరులునుగలరు. ఇట్టి మీరందరు శస్త్రాస్త్ర నిపుణులు, యుద్ధపండితులు. ఇంతేకాక నాకొఱకు ప్రాణములనైన విడువ సిద్ధముగా నున్నారు.

వి॥ "త్యక్తజీవితాః" నాకొఱకై చచ్చినవారనుటచే అమంగళము సూచింపబడుచున్నది. జీవితాశను విడచియున్నారనియు చెప్పవచ్చును.

పాండవసేన చిన్నదైనను గెలుచును. ఎలననగా

శ్లో॥ అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥ 10

తా॥ మా సేన గొప్పది, భీష్మరక్షితము. అయినప్పటికి శతృవులను జయింప జాలదు. పాండవసేన చిన్నదయ్యు భీమరక్షితముగాన జయింప సమర్థముగానున్నది.

వి॥ దుర్యోధనుని దృష్టి ధృష్టద్యుమ్నుని పైకాగదు. భీమునికి వెఱచినంత ఎవరికి వెఱవడు. తనతొడల విఱుగగొట్టుటకు, తమ్మని ఎదచీల్చి నెత్తురుద్రాగుటకు, దుర్యోధనవంశ నిర్మూలనమునకు ప్రతిజ్ఞ చేసిన భీముని యెదుట ఇతర పాండవవీరులు లెక్కకు రాలేదు. అర్జునుని కర్ణుడు గెలుచును. ఇతరవీరులను మీరందరు గెలుతురు. కాని భీముని నే గెలువవలసినదని చెప్పెను. ఈ విజయములు సంశయగ్రస్తములని సూచించి రోషము పుట్టింప ప్రయత్నించెను.

శ్లో॥ అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః।
భీష్మమేవాభిరక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి ॥ 11

తా॥ పాండవసేన బలిష్ఠముకనుక మీరు సర్వమర్మస్థానములను జాగరూకులై కాపాడవలసినది. భీష్మాదులు కర్ణాదులు కొట్లాడక ఐకమత్యముకలిగి, భీష్ముడు చెప్పినట్లు నడచుకొనుడు. సేనాపతియగు భీష్ముని కాపాడుచుండుడని దుర్యోధనుడు నుడివెను.

వి॥ ఇట్లుపలికి దుర్యోధనుడు వ్యసనాక్రాంతుడయ్యెను. "నాకొఱకు పోరాడి జయింపగోరువారు" అనుటకు బదులు "నాకొఱకు పోరాడి చచ్చువారు" అనుటచేతను. మరియు తనసేన శతృజయమున అసమర్థమనుటచే తను దుర్యోధనుడు తనమనమున అపజయమును శంకించెనని స్పష్టమగుచున్నది.

అప్పుడు దుర్యోధనుని విషణ్ణతను పోగొట్టవలెనని భీష్ముడు సింహనాదమొనర్చెను. ఆచార్యుడు దుర్యోధనాపజయము నిశ్చయమని తెలిసి ఊరకుండెను.

శ్లో॥ తస్య సఞ్జనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్॥ 12

తా॥ కురువృద్ధుడును, తాతయునగు భీష్ముడు దుర్యోధనుని యధైర్యము పోగొట్టనెంచి సింహనాదమొనర్చి హర్షము పుట్టింపనెంచెను. శంఖనాదమునుగూడ నొనర్చెను.

వి॥ "నేను ముదుసలినే కాని నేను సేనాపతిగానుండగా నీకేల భయము"ని భీష్ముడు దుర్యోధనుని భయము మాన్ప యత్నించెను.

(సశేషము.)

# దృఢనిశ్చయః

లేఖకుడు:— దివంగత — కథన కళాప్రపూర్ణ —
పండిత నోముల అప్పారావుగారు, కాకినాడ.

[ కవి - పండితుడు - రచయిత - వక్త - భక్తుడు - ప్రచారకుడు, మా మిత్రుడు శ్రీఅప్పారావుగారు 6-1-55 రాత్రి 12-30 నిమిషములకు పరమపదించినారని వారి కుమారునిద్వారా వచ్చినవార్త మమ్ము గంభీర చింతానిమగ్నుల చేసినది. శ్రీవారి ఆత్మకు శాంతి కల్గుగాక ! వారి పవిత్రకుటుంబమునకు మా సానుభూతి. —సం.]



శ్రీమద్భగవద్గీతా శాస్త్రమున భక్తుడు దృఢనిశ్చయుడై యుండవలెనను వాక్యముకలదు. దృఢనిశ్చయమనగా — సాధకుడు తానాచరింప నిశ్చయించుకొనిన సాధనము నుండి చలింపక దృఢముగ నుండుట యని యర్థము. ఎట్టిప్రలోభనముల వలననైన నితరసాధనముల నవలంబింపకుండుటయే. ఏదైననొక మొలక నొకచోటనాటి, దానిని మఱుచటిదినము పెకలించి యింకొకచోట పాతిపెట్టి, మూడవదినమున దాని నింకొకచోట నాటినచో నా మొలక బ్రతుకనేరదు. బ్రతుకనప్పుడు పుష్పించుట, ఫలించుటమాట చెప్ప నేల? ఆ మొక్క నొక్కచోటనే నాటి కదల్పక తగుప్రోడిచేసిన నది జీవించి పుష్పవంతము ఫలవంతము కావచ్చును. అటులే సాధకుడు తన సాధనమును మాటిమాటికి మార్చుకొనుటవలన సిద్ధిని బొందజాలడనుట నిశ్చయము. భగవద్గీతలో నాప్రకరణముననే యింకొకచోట సాధకుడు "స్థిరమతి" యైయుండవలెనని యీ యర్థమే ధ్రువపఱచబడినది.



ఈ మధ్య నేనొక వింతయగు నాంధ్రమిత్రుని కనుగొంటిని. అతడు కొన్నాళ్ళక్రిందట నన్నుజూచినపుడు

"హరేరామ్" అని పలుకుచు వందన మొనర్చెడివాడు. తర్వాత కొన్నాళ్ళకు "శివోఽహం" అని వచించుచు చేతులుజోడించెడివాడు. మఱికొన్ని దినములకు "జయహర నాథ్" అనుట మొదలిడెను. పిమ్మట 'సాయీభగవాన్‌కీజయ్' అనుచుండెను. ఈ ధరిమలాను కనుపడి "మెహర్ భగవాన్‌కీ జయ్" అని నుడివెను. ఇటుపిమ్మట నెన్ని మార్పులు రాగలవో, యెవరెఱుగుదురు? ఇట్టిభక్తులు మఱికొందఱుండ వచ్చును. వారలవలంబించు సాధనములు ఆ యుపాస్యదేవతలు చెడ్డవారని నా యభిప్రాయము కాదు. కాని ఈ విధముగ సాధనమున నిలుకడలేనినాడుసాధకునకుసిద్ధిలభించుట కష్టమగును. సాధన దార్ఢ్యమువలననే సిద్ధి లభించుననుట తత్త్వవేత్తలకు సువిదితము. "సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అనువాక్యము చొప్పున పరమాత్మని నేదేవతా రూపముగనైన నుపాసించవచ్చును. న తత్రదోషః. కాని సాధనమందు దృఢత్వము కలుగువఱకు లేక సిద్ధిని పొందువఱకు నేదేనియొక్కసాధనమునే యవలంబింపవలసియుండును. మాటిమాటికిమార్చుకొనుట శ్రేయస్కరముకాదు. సోదరులారా! ఏ వ్యక్తినైన విమర్శించితినని భావింపవలదు. దురదృష్టవశమున పావనమగు హిందూ (భారత) మతమున కేర్పడిన యీ చపలత్వమును దోషమువలన మనస్సునకుకలిగిన ఖేదము నీవిధముగ దెలియచేయుచున్నాను. మీ కిష్టమయిన మార్గమున సక్రమముగ చలింపక, పయనించుడు. సాధ్యమునుజేరగలరు. మాటిమాటికి మతమును, తత్సాధన కార్యక్రమము మార్చుకొనవలదని మనవి చేయుచున్నాను. నిశ్చలమగుసాధనముద్వారా పరమాత్మనుపాసించి వాంఛితార్థమును బడయగలభాగ్యమును మనకు పరమేశ్వరు డొసంగుగాత.

శాంతిః శాంతిః శాంతిః,

శ్లో॥ సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్తః స మే ప్రియః॥

[శ్రీభగవద్గీత అ. ౧౨ శ్లో॥ ౧౪]



# ★ స్వస్వరూపజ్ఞానము. ★

వేదాంతపితామహులగు శ్రీ రాజేశ్వరానందస్వాములవారు, M.A., D.Litt.

సంపాదకులు – The Call Divine.



(గత సంచిక 27వ పుట తరువాయి)

జాగ్రదవస్థయందుగాని, గాఢనిద్రావస్థయందుగాని స్వప్నము కలుగుటలేదు. గాఢనిద్రయందజ్ఞానము ఘనీభూతమైయున్నది. జాగ్రదవస్థయందు దేహజగత్తు నామరూపవికారవిషయముల ప్రతీతి గలుగుచున్నదిగాన, కారణ కార్యరూపములగు రెంటియందును తత్త్వజ్ఞానము కలుగుటకు వీలులేదు. స్వప్నమునందున్నవానిని లేపుట తేలిక. అట్లే, దేహోహంబుద్ధిలేక, నేనెవరినో నాకుఁదెలియకయుండు సమయమున తత్త్వమసి మహావాక్యార్థ జన్యజ్ఞానముదయించును. జాగ్రత్స్వప్నావస్థలలో నేనను యహంప్రత్యయము గోచరించుచున్నది. సుషుప్తియందది గోచరించుటలేదు గాన, 'అహం' 'ఇదం' 'మమ' 'మమేదం' అను బుద్ధి యజ్ఞానకార్యమగుటచే దనకారణమగు యజ్ఞానమునందె సృష్టిస్థితిలయములను బొందుచున్నది.

తత్త్వమసి మహావాక్యార్థ జన్యజ్ఞాన మన్వయవ్యతిరేకములద్వారా యిట్టి యజ్ఞానమును బాధించుచున్నది. తుర్యావస్థ మహాకారణ శరీరిగానున్న సమయమున "తత్త్వమసి" మహావాక్యార్థ జన్యజ్ఞానము కలుగుట కనుకూలమగు కాలము. "ఆచార్యవాన్ పురుషో వేద నేతరః" "జ్ఞానాదేవ తు కైవల్యమ్"

సుషుప్తి, సమాధి, మూర్ఛలయందాత్మయున్నది. కర్తృత్వాదికముమాత్రము లేదు. బుద్ధివిలీనమైనది. ప్రత్యక్షానుమానాగమములు ధీవిశిష్టాత్మకు గోచరములు. ఉపాధులు భిన్నములైనను చైతన్యమొక్కటియే. దేహమనోవాక్కర్మములులేనిది యాత్మ. సమస్తదృశ్యములను చూచునదాత్మ. కాని చూడబడునది కాదు. దేహముకంటె భిన్నముగా నాత్మగనుపించినచో మోహమునకు హేతువుగలుగదు. అగుచో గారణములేనిది, కార్యముకానిది యాత్మయే. ఏకార్యములేనిది కారణము కానిదియునగును. అవిద్యచేత నారోపింపఁబడినదంతయు మిథ్యయే. అధ్యాసమునకు నధిష్ఠానమునకు నైక్యముకలుగుట భ్రమ. దేహముకంటె దేహి, విషయములకంటె విషయి, మాయకంటె మాయావి యన్యమైనట్లు, దృక్కునకును, దృశ్యమునకును సంబంధములేదు. "అసంగో హి అయం పురుషః" ఆత్మసర్వాధిష్ఠానము; సర్వప్రకాశకము. అంతరదృశ్యమగు యంతఃకరణము, మధ్యదృశ్యమగు దేహము, కరచరణాది యవయవములు, బాహ్యదృశ్యములగు ఘటపటాది విషయములు, పాంచభౌతికమైన జగత్తు, యివన్నియు జడములు. ఆత్మసన్నిధిలేక ప్రకాశింపనేరవు. ఆత్మ స్వసన్నిధిమాత్రాన వీటిని భాసింపజేయుచు, వీటి భావాభావముల

నెరుంగుచు విలక్షణమై, అసంగమై, సాక్షియై, కూటస్థమైయున్నది. ఆత్మచైతన్య మాగంతుకముకాదు. స్వతస్సిద్ధము. పరప్రకాశమునుకోరదు. ఆత్మేతరములు జడపదార్థములు. జాగ్రత్స్వప్నావస్థలు జడములు దృశ్యములు, ఆగంతుకములు, ఆత్మధర్మములుకావు. ఇవి చిత్స్వభావమును విడుచుటచే సుషుప్త్యవస్థయందు గోచరింపవు; స్ఫురించవు. గావున వినశ్యములు, భ్రాంతిజన్యములును. సుషుప్తిదశయందుఁ దెలియమియను యజ్ఞానానుభవము కలదు గాన, నజ్ఞానము దృశ్యమగుచున్నది. సహజమగు యాత్మచైతన్య స్వరూపము సర్వావస్థలయందు ననుస్యూతమై, స్వప్రకాశమానమై,ప్రమాణప్రవృత్తికంటె పూర్వమే సిద్ధమైయున్నది.

నేనని జాగరణమునందహంకారముగాగాని, స్వప్నమునందహంభావముగాగాని, సుషుప్తియందహమ్మనిగాగాని లేనిస్థితి మౌనము. అదియేత్యాగము. అదియేజ్ఞానము. తల్లి తనచిన్నబిడ్డను నిద్రనుండిలేపి యన్నము పెట్టినది. బిడ్డ యన్నము తిని, మరల నిద్రించెను. కొంతసేపైనతరువాత నాబిడ్డ నిద్రనుండి మేల్కొని నాకన్నముపెట్టుము; నేనింకను తినలేదని తల్లితోయనుట విదితమేగదా! అటులే మనస్సు, బుద్ధి, దేహము, కరచరణాది యవయవములివన్నియు బిడ్డ నిద్రయందన్నము తిన్నప్పుడుఁ దమ తమ స్వస్వవ్యాపారములయందు ప్రవర్తించినను, ప్రవర్తింపనియట్లును, చిలుక దనగూటినుండి బయలుదేరిన తరువాత నాగూటితోఁజిలుకకు నెట్టిసంబంధము లేనియట్లును, దశముని కథయందొక బాటసారి, నీవే దశముఁడవని ప్రబోధించిన తరువాతఁ దాలెక్కించిన తొమ్మిది గురితోఁదనకు సంబంధములేనియట్లును; వేదాంతవిజ్ఞాన ప్రబోధసమయమందు దేహబుద్ధీంద్రియాదులుండియు నుండనట్లును; వేదాంత విజ్ఞానసునిశ్చితార్థ మాప్తునిచే ప్రబోధింపఁబడుచుండగా శిష్యునకు మనస్సుచేతగాని, వాక్కుచేతగాని, కాయముచేతగాని, నెట్టియాయాసమును లేకుండగనే క్రియాకారకరూప ప్రపంచప్రవర్తనములేక దక్షిణమే సుప్రసిద్ధముగా, నప్రయత్నముగా, నవ్యవధానముగా, స్వయముగా సాక్షాత్తుగా స్వస్వరూపసిద్ధి హస్తగతముగానున్నది. స్వప్నమునందు సింహమును జూచుటచేతఁ గజము జాగ్రదవస్థను జెందునట్లు సదాచారుడైన యాప్తునియొక్క యనుగ్రహమున శిష్యుడు మేల్కొనఁగలఁడు.

ఆవిద్యామయమునిఁబురస్కరించుకొని విధిప్రతిషేధరూపమగు కర్మకాండము నారోపాపవాదన్యాయమున ప్రవర్తించు మోక్షదాయకమగు జ్ఞానకాండము వర్తిల్లుచున్నయది. బంధమోక్షములు సాపేక్షపదములు బంధమవిద్యాకల్పితము. ఆత్మయందు బంధబోధక ప్రమాణవాక్యములు లేవు. ఆత్మయందు బంధారోపముగాని, దాని నిషేధముగాని యున్నదనుకొనుట మాయాకృత్యము. నీటియందుండు మత్స్యము దప్పికయైనదనినట్లును, సర్వత్ర నిండియుండు యాకసమును ననేకదిక్కులందు వెతకునట్లును,

స్వతస్సిద్ధమైన నాత్మస్వరూపచైతన్యమును బొందుటకై ప్రసంఖ్యానవిధి నవలంబించు నట్టున్నయది.

అజ్ఞానమును బాధించునది జ్ఞానమే. వైరాగ్యముపరతియందుండినను బోధలేని యెడల నజ్ఞానము బాధింపఁబడదు. వైరాగ్యోపరతులు ముముక్షువుల కనుకూలములు.

రాముఁడు సీతవేషమునుధరించి నటించినను తాను రాముఁడనన్న స్వస్వరూప జ్ఞానమును మరువఁడు. ఇట్టిజ్ఞానము నిర్వికల్పమైనది అపరోక్షకృతకృత్యునకు జీవేశ్వర జగజ్జాలమంతయు నెండమావులవంటిది. ఆకసమున వృక్షమే లేనితఱి, కాయకాచి పండు పండిన దనుటయు నాపండుయొక్క గుణాగుణముల నిర్ణయింప బూనుకొనుట నెవ్విధముగానుండునో, యట్లే ధర్మాధర్మములజ్ఞానజగత్తునందలివిగాన "సర్వధర్మాన్ పరిత్యజ్య" యని శ్రుతులు చెప్పుచున్నవి. గనుక, లక్ష్యమైన నాత్మకును, వాచ్యమైన దేహేంద్రియాదులకును గలుగు యధ్యాసమే యధర్మము. స్వస్వరూపజ్ఞానమే ధర్మము.

లౌకికము, వైదికము, వేదాంతమునని మూడు తెఱంగులు.

1. లౌకికము. లోకవ్యవహారమైనది, శబ్దజన్యమైనది, పురాణేతిహాసములు ప్రమాణములు. ఉదాహరణము ప్రబోధమునకు సహకారి.

2. వైదికము వేదవిహిత యజ్ఞయాగాది కర్తృకర్మక్రియల వ్యవహారము. స్వర్గభోగ సుఖానుభవము. స్మృతులు ప్రమాణములు. ఉదాహరణముచేతగాక ననుష్ఠానము చేతనే సాధించవలసియున్నది.

3. వేదాంతము. అలౌకికమై, సనాతనమై, స్వస్వరూప సాక్షాత్కారమైనది. ప్రస్థానత్రయములు ప్రమాణములై గురుశిష్యన్యాయమున బోధ్యబోధక లక్షణమై ప్రజ్ఞావంతమై యున్నయది. కర్తృత్వాది త్రైగుణ్యావిషయములు లేనందున నిందుదాహరణముగాని, యనుష్ఠానముగాని పనికిరానందున వాటి నతిక్రమించి, వాటికి ప్రకాశమైన స్వానుభవమె జాగ్రదాది సర్వానుభవములకు ననుభవస్థానమైనది. ఉపనిషదర్థమై, సన్న్యాసలక్షణమై, తత్త్వమసి మహావాక్యార్థజన్య జ్ఞానానుభవమై, ప్రత్యక్పరాభిన్నమై స్వయంప్రకాశస్వరూపమైనది. ప్రమాణమునకును ప్రమేయమునకును సంబంధముచేత జనించునదాత్మజ్ఞానము. రాజాజ్ఞవంటిది శ్రుతిప్రమాణము. మిత్రవాక్యమువంటిది స్మృతి ప్రమాణము. బాలవచనములవంటివి పురాణేతిహాసములు. ఆత్మజ్ఞానమునకు స్వానుభవమే ప్రమాణము. మహనీయులయనుభవములే శ్రుతులుగాన, నవి జ్యేష్ఠముగాను, శ్రేష్ఠముగాను, ప్రౌఢముగాను, ప్రబలముగాను నుండును.

పరాపరములని శక్తి రెండువిధములుగ నుండును. పరాశక్తికి యిచ్ఛ, క్రియ, జ్ఞానములనునవి స్వరూపములు. ఇవి జాగ్రత్స్వప్నావస్థలయందుండు యనుభవములు. అపరాశక్తి నిద్రావస్థయందు యిచ్ఛ, క్రియ, జ్ఞానము యను వివక్షతలేకను, బుద్ధి దేహ

జగత్ప్రతీతిలేకను, పరమాత్మను నావరించిన యజ్ఞానము కనుక, గాఢరాత్రి స్వరూపముగా నుండును. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల నవస్థాభిమానములు ననుభవింపఁబడు దృశ్యములును పరాపరశక్తి స్వరూపములగును.

తిరిగి యివి విద్యయనియు నవిద్యయనియు ద్వివిధములు. దేహోహంబుద్ధి, జగత్సత్యత్వదృష్టి, యిహపర సౌఖ్యవాంఛలు మున్నగువానియందు గానుపించుశక్తి యవిద్యాశక్తివి. దేహము, దేహి వేరనియు, దేహి యథార్థముగా స్వయంప్రకాశ సచ్చిదానంద పరబ్రహ్మమనియు, ననాత్మజ్ఞానముచేతఁ దానా దేహమను భ్రాంతి జెందుటయు, నా దేహోహదృష్టియందు గానుపించు యథార్థానుభవమును ప్రత్యక్షానుమానములుగా నిశ్చయించి, ఆత్మానాత్మవివేకముద్వారాను, అన్వయవ్యతిరేక యుక్తులద్వారాను, "అహం బ్రహ్మోఽస్మి" యనెడి యనుభవమువరకునుగల వివేకశక్తికి విద్యయని పేరు. అట్టి విద్య యవిద్యానాశమువఱకుఁ గానుపించును. అవిద్య విద్యచేతఁ బాధింపఁబడగ విద్యయును కర్పూరజ్యోతివలె లేనిదై యద్వితీయబ్రహ్మాత్మానుభవమున కన్యము కానిదై యుండును.

ఆత్మానాత్మవివేకస్థితియందు ప్రతిఫలించునది బ్రహ్మశక్తిమాత్రమే. నీరు మన్ను గలియునప్పుడా నీరు మట్టి వేరువేరుగా గాన్పింపక నుండునట్టి స్థితి బురద. ఇట్టి బురద నీరుగాదు. మట్టియును గాదు. ఈ రెండును కలియనిది బురద గాదు. ఈ రెంటి కలయికయె సంధి, లేక గ్రంధియన్న పేరుతో బురదగానైనది. ఇట్లే, ఆత్మయనాత్మల యొక్క సంధియందు ప్రతిఫలించునది శక్తి. అనఁగా మాయ. పారమార్థికముగా లేనిది.

మూడు విధములు. భౌతిక, దైవిక, పారమార్థికములని వాటి పేరులు.

### 1. భౌతిక దృష్టి:—

భూతములయందు ప్రతిఫలించు జ్ఞానము శబ్దస్పర్శాది పంచభూతములయం దంతఃకరణాది యింద్రియములతోఁ గూడిన పరిచ్ఛిన్నత్వ జ్ఞానము. కించిద్జ్ఞత్వ కర్తృత్వాదులతోఁ గూడిన దృష్టి. ఇచ్ఛా క్రియ జ్ఞానము లనెడి పరాశక్తియందు ప్రతిఫలించి, జాగ్రత్స్వప్నములయందు వ్యవహరించును. యిది యపరాశక్తి యొక్క యంశము.

### 2. దైవిక దృష్టి:—

పంచభూతములే దేహముగాఁగల సర్వజ్ఞత్వాది గుణములతోఁ గూడిన నపరిచ్ఛిన్నత్వ దృష్టి. ఈశ్వరత్వము అపరాశక్తియందు ప్రతిఫలించు జ్ఞానమున్నది.

### 3. పారమార్థిక దృష్టి:—

త్రిపుటి రహితమయిన ప్రత్యక్పరాభేదజ్ఞానము కలది.

(సశేషము)

# ఒక్క మాట.

## రచన:- స్వామి శ్రీ శివానందజీ - ఆనందకుటీర్.

భగవద్గీతను ఎక్కువగ పఠించు కొలఁది, దానియందు ఎక్కువగ చొరఁబడు కొలఁది నీకు అధికమైన జ్ఞానమును, ఆనందమును కలుగును. నీకు వీలైనన్ని పర్యాయములు ఈ గ్రంథమును పునః పునః పఠనము గావించి, అందలి విషయములను సంపూర్ణముగ ఒంటబట్టునట్లు చేసికొనవలయును. ప్రతి పర్యాయము నీకు నూతన భావములు, నూతన జ్ఞానము, నూతన అంతరీక్షణము ఉదయించును. కొద్దిపాటి సంస్కృత జ్ఞానముఁగలవాఁడు సైతము దానిని అర్థము చేసికొనఁగలయట్టి సులభమైన భాషలో, సరళమైన శైలిలో గీత వ్రాయబడినది.

భగవద్గీత వేదములయొక్క పిండితార్థము. హిందూమతమునకు ప్రమాణ గ్రంథములైన *ప్రస్థానత్రయములో అదియొకటి. ప్రస్తుతము అమెరికనులు, జర్మనులు, యూరోపియనులుకూడ గీతాపఠనమునందు బహుతీవ్రశ్రద్ధను చూపుచున్నారు. గీతోపదేశములు వాస్తవముగ అభ్యాస యుక్తమైనవి, సర్వజనీయమైనవి, సర్వసామాన్యమైనవి. జీవితమున అవి విశాల దృక్పథమును కలిగియున్నవి. ఎటువంటి తికమకయైన, ప్రధానమైన జీవితసమస్యకైనను నీకు గీతయందు సమాధానము కనఁబడును.

సమస్త ప్రపంచమునందలి స్త్రీపురుషులకు సజ్జీవన, సదాలోచనల కొఱకు ప్రవర్తనా నియమములను నిర్ణయించునట్టి గ్రంథము గీత. అమృతత్వ, బ్రహ్మానందములనెడి పరమధామమునకు సరియైన, తిన్నని బాటను చూపునట్టిది గీత. యువతీయువకుల జీవితమునకు ఆకృతినొసంగ నుద్దేశించు పొత్తముగీత. ఈ జగత్తులో జీవిత కర్తవ్యములను నిర్వర్తించుచునే, మనస్సును నిగ్రహించుటకును, బీభత్సమై చెలరేగెడి ఇంద్రియములను అణచుటకును, పాపగుణములను పరిమార్చుటకును, దైవీ సంపత్తును అలవరచుకొనుటకును, నైతికసిద్ధిని పడయుటకును, భక్తిని అభివృద్ధి చేసికొనుట

* గీత, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు.

కును, కర్మయందు విమోచనము నొందుటకును, మనస్సును నిర్మలము గావించుకొనుటకును, సాయుజ్య (మోక్ష)మును పొందుటకును, – నిర్దేశితమైన, ప్రత్యక్షమైన, ప్రయోజనకరమైన, ప్రబలమైనపద్ధతులను నిర్ణయము చేయునట్టిది గీత.

కాన, గీతను ప్రతివ్యక్తియు సంపూర్ణముగ పఠనముచేయవలెను. అది నీకు హితుఁడు, మిత్రుఁడు. అది నీకు తండ్రి, తల్లి, భ్రాత, గురువు. ఆ గీత నీకు పథముఁ జూపుఁ గాక !

గీతాపఠనము హిందూదేశమందలి అన్ని పాఠశాలలలో, అన్ని కళాశాలలలో, వేయేల, ప్రపంచమందలి సకల పాఠశాలలలో కళాశాలలలో నిర్బంధపాఠవిషయము కావలెను. పాఠశాల విద్యార్థులకు కళాశాల విద్యార్థులకు అది పాఠపుస్తకముకావలయును. దానిని వారి ప్రణాళికలో చేర్చవలెను. ప్రతి విద్యావిధానములో దానికి కడుం గడు ప్రధానస్థానమొసఁగవలెను.

కేవల లౌకికవిద్య వట్టి ఊక వంటిది. అది కేవల ఆహారసంపాదనోద్యమమునకే తోడ్పడును. జీవితములో తిని, త్రాగి, తూగుట కంటె మఱియొక ఘనతరోద్యమము లేదా? నీవు చిన్నప్రాయమున నున్నపుడే నీ చిత్తభూమియందు ఆధ్యాత్మిక బీజమును చల్లవలెను. అట్లు చేసిననే, అది నీ యుద్యోగవిరమణ కాలమునాటికి వేరుపెట్టి, పూచి, కాచి, ఫలించును. లౌకిక విద్యతోబాటు నైతికశిక్షణయు, ఆధ్యాత్మిక శిక్షణయు నొసగునట్టి విద్యావిధానము నే శాస్త్రీయమైనదనియు, సమయుక్తమైనదనియు, సచేతనమైనదనియు, సంపూర్ణమైనదనియు భావింపఁనగును.

అనువాదము:–

R. రాధాకృష్ణయ్య, వేంకటగిరిటౌన్.



# వార్తలు.

డిసెంబరునెల 24 వ తేదీ నుండి జనవరి 8 వ తేది వరకు తూర్పుగోదావరి జిల్లా ర్యాలి గ్రామమునందు శ్రీ ఉమాకమండలేశ్వరస్వామివారి ఆలయ ఆవరణములో శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారి సౌజన్య సహాయముతో శ్రీ శంకరానందస్వాముల వారి భగవద్గీతోపన్యాసములు జరిగినవి. వస్తాదు సయ్యపురాజు గారు వెంకటగోపాల కృష్ణంరాజు గారు కార్యక్రమము ముగియు వరకు శ్రీస్వాములవారి వెంటనుండి కార్య క్రమమును జయప్రదముగ జరిపించినారు.

శ్రీ శంకరానందస్వాములవారును శ్రీ రామకృష్ణానందస్వామివారును 9-1-55 తేదీ ర్యాలి నుండి బయలుదేరి మధ్యాహ్నమునకు రాజమహేన్ద్రవరము వీరభద్రపురం నందలి ఆదర్శ మహిళా విద్యాలయమును చేరుకొనిరి. విద్యాలయ వ్యవస్థాపికయగు శ్రీ బి.కె. వెంకటరమణమ్మగారును కార్యదర్శిని సాధుజనాబాయిగారును శ్రీస్వాముల వారికి విద్యాలయమునందు తగిన బస వసతి కల్పించినారు. భారత మహిళాభ్యున్నతికి పాటుపడు ఆ సంస్థను తిలకించి శ్రీస్వాముల వారు పరమానందము చెందిరి. శ్రీ సాధు అమ్మగారి అధ్యక్షతతో సాధు స్త్రీల మఠమునందు రెండు ఉపన్యాసములు జరిగినవి. అచ్చటినుండి శ్రీవారు నంద్యాలకు వెళ్ళినారు.

జనవరి 12, 13, 14 తేదీలు నంద్యాల త్యాగరాజ కుటీరమునందు శ్రీ త్యాగరాజ జయంతులు జరిగినవి. శ్రీశంకరానంద రామ కృష్ణులు అందు పాల్గొన్నారు.

15-1-55 మొదలుకొని అయిదు రోజులు మైసూరుస్టేటు చన్నగిరియందు శ్రీశంకరానందస్వాములవారి గీతోపన్యాస కార్యక్రమము జరిగినది. వేలాది భక్తసమూహముతో కార్యక్రమము అత్యంత వైభవోపేతముగ నెరవేరినది.

22-1-55 నుండి 15 రోజులు హొస్పేట శ్రీ గీతాసేవాశ్రమమునందు ఉదయము విచారసాగర ప్రవచనము, సాయంకాలము గీతోపన్యాసమును జరిగినది. 7-2-55 నుండి 3 రోజులు శ్రీగీతా సేవాశ్రమ వార్షికోత్సవము నెరవేరినది,

25-1-55 నుండి నాలుగు రోజులు ప్రొద్దుటూరు శ్రీ కృష్ణగీతాశ్రమమునందు శ్రీ రామకృష్ణగారు భాగవత ప్రవచనము సలిపినారు. ఆ సందర్భమున కవిపుంగవుడు శ్రీ బడబాగ్ని నారాయణరాజు గారు రచించిన అభినందన పద్యములు సమర్పింపబడినవి.

బెంగుళూరు శ్రీ బ్రహ్మవిద్యాశ్రమమునందు 9-2-55 నుండి 16-2-55 వరకు జరుగు శ్రీకబీరనాథ పుణ్యారాధన సప్తాహమునందు శ్రీ రామకృష్ణానందస్వామివారు భాగవతోపన్యాసము లొనర్చెదరు. శ్రీ శంకరానందస్వాములవారు ఇచ్చటి నుండి హొంగరేకాణ్ గిరి వెళ్లెదరు.

హొంగరేకాన్ గిరి యందలి శ్రీ శివానంద సేవాశ్రమములో శ్రీ శివరాత్రి ప్రయుక్త సప్తాహము జరుగగలదు. అచ్చటి నుండి శ్రీ వారు అనుపనహళ్ళియందు 23-వ తేదీనుండి మూడురోజులును, తావరెకెరెయందు 26-వ తేదీనుండి వారము రోజులును గీతోపన్యాసము లొనర్చెదరు.

తదనంతరము 8-3-55 నుండి మూడు రోజులు కోలారుజిల్లా అగరమునందు జరిగెడి శ్రీ సనాతన వేదాంతజ్ఞాన సభయందు పాల్గొందురు. ఆ సమయమున శ్రీవారి హిందీ ఉపన్యాసమును శ్రీ రామకృష్ణానందగారు అనువదించెదరు.

శాంతి ఆశ్రమము (తోటపల్లికొండలు) పూజ్యపాద శ్రీ ఓంకారస్వాములవారి జన్మదిన మహోత్సవములు జనవరి 21, 22, 23 తేదీలు వైభవోపేతంగా నిర్వహింపబడినాయి. ఈసందర్భాన్ని పురస్కరించుకొని శ్రీవారు "మానవజన్మయొక్క ఉత్కృష్టతను, పవిత్రతను గుర్తించుటయే నిజమైన జన్మదినము. నాజన్మదినమే మీ జన్మదినము కూడా" అంటూ "ప్రతిరోజూ జన్మదినముగా జేసుకొని సదా ఆత్మభావనతో ఆనందించుచున్న వారి జీవితములే పరమపావనమైనవి. భక్తవరేణ్యులకు, ఆత్మవేత్తలకు రోజూ జన్మదినమే" అనివివరిస్తూ 'మీ జన్మహక్కైన బ్రహ్మసాక్షాత్కారమును అపరోక్షముగా అనుభవింప ప్రయత్నించెదరుగాక!' యని భక్తగణానికి జన్మదినపు కానుకగా తమ సద్భావములను అందించారు.

## గ్రంథ స్వీకృతి

**1. గీతాదండకము:—** 1-0-0

**2. గీతాసార దండకము:—** 0-8-0

కవి:- కరణం అశ్వత్థరావుగారు, కలుగోడు పోస్టు, (వయా) రాయదుర్గం, అనంతపురంజిల్లా.

**3. మహావాక్యవిచారణము:—** 0-4-0

గ్రంథకర్త:- శ్రీరామచరణముగారు.

ప్రకాశకులు:- శ్రీవ్యాసాశ్రమము, ఏర్పేడుపోస్టు, చిత్తూరుజిల్లా.

**4. ఆధ్యాత్మికసాధన క్రమము:—** 1-0-0

గ్రంథకర్త:- శ్రీ రామశరణ్ గారు.

ప్రకాశకులు:- శ్రీ రామనామక్షేత్రము, గుంటూరు.

ప్రసిద్ధమగు ఆధ్యాత్మిక సంస్థ శ్రీరామనామక్షేత్రమువారు ప్రకటించిన అమూల్య గ్రంథరాశిలో నిదియొక ఉత్తమ గ్రంథము. అన్ని విధముల అర్హత - అధికారముకల రచయిత వ్రాసియున్నారు. ఆధ్యాత్మిక సాధకులకు మక్కానివంటిది.

5. భగవంతుడు నూతనుడా – సనాతనుడా? 5–0–0

6. సత్యసందేశములు (వెలలేదు)

రచయిత్రి:– శ్రీ కృష్ణమ్మ, 'అయోధ్య' మేడికరిపోస్టు, చిత్తూరుజిల్లా.

దైవిక ఆవేశనతో కూడిన రచయిత్రి సత్యశోధనలో – పరమాత్మని అన్వేషణలో తనకు కలిగిన అనుభవాలను హృదయాలు స్పృశించేటట్లు వర్ణించింది. శ్రీరామతీర్థస్వామి వలె రచయిత్రి ఆవేశపూరితమైన గంభీరసందేశాలను రోచకశైలిలో వినిపించింది.

7. శ్రీకృష్ణుని గీతావాణి:– 0–8–0

లేఖకుడు:– వి. కృష్ణారావుగారు, ఆరుట్లపోస్టు, ఇబ్రాహింపటణ్ తాలూకా, హైదరాబాదు (దక్కన్).

ప్రియుడు తన ప్రేయసికి శ్రీకృష్ణునిగూర్చియు ఆయన బోధలనుగూర్చియు సులువైన శైలిలో వ్రాసిన తొమ్మిది లేఖలు యిందుకూర్చి ప్రథమభాగముగ వెలువరించినారు.

8. ఉత్తరగీత:– (పద్యానువాద సహితము) 1–4–0

బాలకవి ఓరుగంటి నారాయణప్పగారు (సాధు సహజానంద), రామప్పవీధి, తిమ్మనచర్లపోస్టు, అనంతపురంజిల్లా.

9. గీతాసాధనడైరీ (1955):– 1–12–0

ప్రకాశకులు:– సాధన గ్రంథమండలి, తెనాలి.

ప్రసిద్ధములగు యీ మండలివారు గత సంవత్సరమునుండి యీ విధముగ డైరీలను వెలువరించుచున్నారు. గడిచినసారి ఈ విషయమును గూర్చి మేము చక్కగా సమాలోచించియున్నాము. గత సంవత్సరములో జరిగిన ముద్రణాస్ఖాలిత్యములను తీర్చుకొని మరింత మెరుగై యీసారి డైరీ ఆకర్షకమైయున్నది. వేయ్యేల! అన్ని విధముల ఉత్తమమయిన డైరీ. డైరీకివలయు హంగులన్నియు ఉన్నవి. ప్రతి ఆంధ్రుడును తప్పక ఆదరించి మండలివారి ఉద్యమమునకు వికాసము కల్గింతురు గాక!

10. గీతోపదేశహారము:– (భక్తినివేదన ప్రత్యేకసంచిక)

ప్రకాశకులు:– శ్రీవిశిష్టాద్వైత ప్రచారక సంఘము – విజయవాడ 1.

మార్గశీర్ష మాసమున వెలువరించిన ప్రత్యేకసంచికవలెనే భగవద్గీతా సంబంధమగు వివిధ విషయములతో రోచకముగ నున్నది. గీతాభక్తులకు అవశ్యము సంగ్రహింపదగినది.

11. కిన్నెర:– (జనవరి ప్రత్యేకసంచిక) 2–0–0

పేజీలు 200. కిన్నెర కార్యాలయము, 18 జోన్సు స్ట్రీటు, మదరాసు–1.

కిన్నెర మాసపత్రిక సంస్కృతి వికాసమునకు ప్రోత్సహించు సుందరమైన పత్రిక. కళను సంస్కృతిని సాహిత్యమునుగూర్చి ఈ ప్రత్యేక సంచికయందు సుమారు నలభై వ్యాసములు చేర్చబడినవి. పరిశుద్ధమైన అచ్చు. ఆకర్షకమైనముఖచిత్రము. ఉత్తమకోటికి చెందిన అద్భుతపత్రిక సంవత్సర చందా నాల్గు రూపాయలు. చందాదార్లకు ప్రత్యేక సంచిక ఉచితము.

# గీతావాణి - పోషక వర్గము.

## మహారాజ పోషకులు రు. 108

కర్నూల్ జిల్లా: 1. శ్రీశైల సూర్యసింహాసనాధీశ్వర శ్రీశివాచార్యస్వాములవారు - 2. మాతృశ్రీ చిన్నమ్మగారు, శ్రీ సీతారామాశ్రమం, గుళ్లదూర్తి, - 3. శ్రీ సి. పి. తిమ్మారెడ్డిగారు, నాగిరెడ్డిపల్లె, - 4. స్వర్గీయ నేగు సుబ్బన్నశ్రేష్ఠిగారి ధర్మపత్ని శ్రీ లక్ష్మమ్మగారు, నంద్యాల. - 5. శ్రీ వంకదార సుబ్బయ్యగారు, దొర్నిపాడు, - 6. శ్రీ పగిడేల లక్ష్మీనారాయణరెడ్డిగారు, దొర్నిపాడు, - 7. శ్రీ తొమ్మంద్ర రామసుబ్బయ్య శ్రేష్ఠిగారు, చాగలమర్రి. - 8. శ్రీఉప్పలపాటి నారాయణరెడ్డిగారు, ఎం. కృష్ణాపురము, - 9. శ్రీ ఇ. బి. బాలసుబ్బయ్యగారు, ఆళ్లగడ్డ. - 10. స్వర్గీయ శ్రీ జి. వీరారెడ్డిగారు, వి.ఎం. ఎర్రగుడిదిన్నె, - 11. శ్రీమతి పగిడి శాయమ్మగారు, నంద్యాల.- 12. శ్రీబొల్లు పల్లి చిన్నఓబయ్యగారు, పడకండ్ల,

కడపజిల్లా: 13. శ్రీ హిమకుంతల ఈశ్వరనారాయణరావుగారు, రామిరెడ్డిపల్లె, - 14. శ్రీ బచ్చు బంగారు మునెయ్యశ్రేష్ఠిగారు, ఎర్రగుంట్ల ఆర్.ఎస్. - 15. శ్రీపోతే పల్లె రాజా వెంగన్నశ్రేష్ఠిగారు, వల్లూరు.

అనంతపురం జిల్లా; 16. పూజ్యపాద శ్రీ చిద్గనానంద మహర్షులవారు, శ్రీ భవ నాశి ఆశ్రమం. - 17. శ్రీ పోసిన వెంకటరెడ్డిగారు, రాగలపాడు. - 18. శ్రీ పి. నర సింహశాస్త్రిగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 19. శ్రీ మదళ్ళపల్లి మునిసుబ్రహ్మణ్యంశ్రేష్ఠిగారు, చిత్తూరు. - 20. శ్రీ యస్. రామలింగంపిళ్లెగారు, చిత్తూరు.

నెల్లూరుజిల్లా: 21. శ్రీ వాకాటి సంజీవశెట్టిగారు, నెల్లూరు. - 22. శ్రీ వేమా రెడ్డి బలరామరెడ్డిగారి ధర్మపత్ని యశోదమ్మగారు, ఇనమడుగు.

గుంటూరు జిల్లా: 23. శ్రీ శ్రద్ధానందస్వాములవారు, శ్రీ బ్రహ్మానందాశ్రమము, పెరవలిపోస్టు, (తెనాలి)

కృష్ణాజిల్లా: 24. శ్రీధూర్జటి సుబ్రహ్మణ్యంగారు, బందరు. - 25. శ్రీ భట్టిప్రోలు సత్యనారాయణరావుగారు. సర్కిల్ పేట, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 26. శ్రీ సమయమంతుల నాగేశ్వరరావుగారు, ర్యాలి. - 27. శ్రీ సమయమంతుల ప్రకాశంగారు - సుబ్బమ్మగారి స్మారకముగ కుమారుడు శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి - 28. స్వర్గీయ సమయమంతుల మాణిక్యమ్మ కుమారుడు రామకృష్ణగారి స్మారకముగ తండ్రి శ్రీ నాగేశ్వరరావుగారు, ర్యాలి. - 29. శ్రీమాతం శెట్టి వెంకటరత్నం - శేషమ్మగార్ల స్మరణార్థం కుమారుడు జగ్గారావుగారు ర్యాలి. - 30. శ్రీ సమయమంతుల సత్యనారాయణ - వెంకటసుబ్బమ్మగార్ల స్మారకముగ శ్రీ నాగేశ్వరరావుగారు, రాధాకృష్ణరావుగారు, ర్యాలి.

పశ్చిమ గోదావరి జిల్లా: 31. శ్రీరాజులపాటి వేంకటేశ్వరులు గారు, పాలకొల్లు. — 32. స్వర్గీయ శ్రీమతి అద్దేపల్లి శేషరత్నమ్మగారి స్మారకముగ — భర్త శ్రీ సత్యనారాయణమూర్తిగారు, పాలకొల్లు.

నైజాంస్టేట్: 33. శ్రీ డి. పి. సదాశివరాజులుగారు, ఆనెగొంది. — 34. శ్రీ పడిశాల భద్రయ్యగారు, వరంగల్ — 35. శ్రీసాధు పాపయ్యగారు, బ్రహ్మవిద్యాశ్రమం, కేశవపట్నం, కరీంనగర్ జిల్లా.

మైసూరుస్టేట్: 36. శ్రీ పెండుకూరి గోవిందప్ప అండ్ సన్స్, హాస్పెట్ — 37. శ్రీ పత్తికొండ సుబ్రహ్మణ్యప్పశ్రేష్ఠిగారి ధర్మపత్ని సౌభాగ్యవతి లక్ష్మీబాయమ్మగారు, హాస్పేట — 38. శ్రీ గంగావతి భీమప్పశ్రేష్ఠిగారు, నారాయణదేవరకెర. — 39. శ్రీ ఎం. వి. రామలింగయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట, — 40. శ్రీ జి. ఎన్. శంకరనారాయణ బ్రదర్సు, బెంగుళూరు సిటి.

మద్రాస్ రాష్ట్రం: 41. శ్రీ ఆర్.పి. రామనాథంరెడ్డిగారు, కాటుకానల్లూరు, — 42. శ్రీగంథే నరసయ్యశ్రేష్ఠిగారు, నెం. 158 అణ్ణాపిళ్లెవీథి, మద్రాసు.

## రాజపోషకులు రు. 54

కర్నూలు జిల్లా: 1. స్వర్గీయ శ్రీబృందాదేవిగారి స్మారకముగ శ్రీ N. అయ్యపురాజుగారు, గోనపాడు. — 2. శ్రీ అమరావతి గోవిందప్పగారు, నొస్సం. — 3. శ్రీ చాటకొండు ఓబుళేశ్వరం శ్రేష్ఠిగారు, ఆళ్లగడ్డ. — 4. శ్రీ జె. ఆర్. ఆంజనేయులుగారు, ఆళ్లగడ్డ. — 5. శ్రీ సోముల పెద్దసుబ్బారెడ్డిగారు, ఆళ్లగడ్డ. 6. శ్రీ బైసాని రామదాసుగారు, ఆళ్లగడ్డ. — 7. డాక్టరు పి. పుల్లారెడ్డిగారు, ఆళ్ళగడ్డ. — 8. శ్రీ లక్కిరెడ్డి హనుమంతురెడ్డిగారు, బ్రాహ్మణపల్లె.—9. శ్రీ N. రామిరెడ్డిగారు,డబ్ల్యు. కొత్తపల్లె. — 10. శ్రీ మదళ్లపల్లె రామసుబ్బయ్యగారు, చాగలమర్రి. — 11. శ్రీజూటూరు చెంచుసుబ్బయ్యశ్రేష్ఠి & గరుడయ్యశ్రేష్ఠిగారలు,చాగలమర్రి. —12. శ్రీమతి ఆర్.సుబ్బరత్నమ్మగారు, నంద్యాల. — 13. శ్రీ పాణ్యం రామచంద్రయ్యగారు, నంద్యాల. — 14. శ్రీ పాణ్యం రామనాథశాస్త్రిగారు, కోయిలకుంట్ల. — 15. శ్రీ టి. సుబ్బయ్యగారు, పాణ్యం. — 16. శ్రీ శాగం చిన్నకొండారెడ్డిగారు, పేరూరు — 17. శ్రీ జి. సి. బాలన్నగారు, ఆళ్లగడ్డ. — 18. శ్రీ యం. చిన్నఈశ్వరరెడ్డిగారు, ఐలూరు. 19. శ్రీ కృష్ణం గురవయ్యశ్రేష్ఠిగారు, మర్చంట్, చాగలమర్రి. — 20. ధర్మపత్ని శ్రీమతి రత్నమ్మగారి స్మరణార్థం భర్త మాఖం సుబ్రహ్మణ్యంగారు, నంద్యాల.

కడప జిల్లా: 21. శ్రీ పెద్దిరెడ్డి నారాయణరెడ్డిగారు, పాలూరు. — 22. శ్రీ ఎన్. వీరయ్యగారు, శ్రీ ఎం. ఓబయ్య & కంపెనివారు, ప్రొద్దటూరు. — 23. శ్రీ మిట్టా నారాయణశ్రేష్ఠిగారు, పెద్దజూటూరు. — 24. శ్రీ వెంటంశెట్టి శ్రీనివాసశ్రేష్ఠిగారు,

వేంపల్లి. — 25. శ్రీ తల్లం గురుమూర్తిగారి కుమారుడు వెంకటయ్య శ్రేష్ఠిగారు, ప్రొద్దుటూరు. — 26. శ్రీ ముమ్మడి పెద్ద సుబ్బారెడ్డిగారు, పాలూరు.

అనంతపురం జిల్లా: 27. శ్రీమతి మంచికంటి సాకమ్మగారు, తాడిపత్రి. — 28 శ్రీ బుస్సెట్టి వన్నప్పగారు, ఉరవకొండ. — 29. శ్రీ కాలువ వెంకటరెడ్డిగారు, రాగలపాడు. — 30. శ్రీమతి పోసిన అచ్చమ్మగారు, రాగలపాడు. — 31. శ్రీ గుంతపల్లి లక్ష్మయ్యచౌదరిగారు, కుందనగుర్తి, — 32. శ్రీ పటేల్ వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 33. శ్రీ కందుకూరు వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 34. శ్రీ పాటిల్ తిమ్మారెడ్డిగారు, కుందనగుర్తి. — 35. శ్రీ పెద్దకదిరప్పగారు, కుందనగుర్తి. — 36. శ్రీ చిన్నకదిరప్పగారు, కుందనగుర్తి. — 37. శ్రీ సాధు శివలింగప్పగారు, కుందనగుర్తి. — 38. శ్రీ శావాల గోవిందప్పగారు, కుందనగుర్తి — 39 శ్రీ ఉద్యాల వెంకటరెడ్డిగారు, కుందనగుర్తి. — 40. శ్రీ శాకల ఆంజనేయులుగారు, కుందనగుర్తి. — 41. శ్రీపాటిల్ పెద్దబళిరెడ్డిగారిభార్య శ్రీమతి లక్ష్మమ్మగారు, కుందనగుర్తి.—42. శ్రీమ్యాడం అశ్వత్థప్పగారు, కల్యాణదుర్గం. — 43. శ్రీ కానుల శరభయ్యశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 44. శ్రీ బెల్లంకొండ రామప్పగారి వెంకటరమణప్ప కుమారుడు తిమ్మప్పశ్రేష్ఠిగారు, కల్యాణదుర్గం. — 45. శ్రీ గాధంశెట్టి లక్ష్మక్క కుమారుడు సుబ్బరాయుడుగారు, కల్యాణదుర్గం.

చిత్తూరు జిల్లా: 46 శ్రీ కె. వెంకటరామారెడ్డిగారు, కొత్తకోట. — 47. శ్రీ బల్లా తెప్పలనాయుడుగారు, ముత్తరపల్లె. — 48. శ్రీ పి. చిన్నమరెడ్డిగారు, పెరియంబాడి. 49. శ్రీ నటకల రామనాథంశ్రేష్ఠిగారు, చిత్తూరు.

నెల్లూరు జిల్లా: 50. బ్రహ్మచారి శ్రీ బి. రాజయ్యగారు, శ్రీదత్తాత్రేయాశ్రమము. కనుపర్తిపాడు.

కృష్ణా జిల్లా: 51. ముక్కామల సీతయ్యగారి జ్ఞాపకార్థము ధర్మపత్ని శ్రీమతి నాగరత్నమ్మగారు, ఈడుపుగల్లు.—52. శ్రీ బావినేని రామకోటయ్యచౌదరిగారు, పరమాత్మానందాశ్రమము, పెనమలూరు. — 53. శ్రీ ఆదూరి చలపతిరావుగారు. బందరు. — 54. శ్రీ మోటుమర్రి దయానిధిగారు, బందరు.

తూర్పుగోదావరి జిల్లా: 55. శ్రీసమయమంతుల పెద్దనాగేశ్వరరావుగారు, ర్యాలి. 56. శ్రీ సమయమంతుల జగ్గారావు & బ్రదర్స్, ర్యాలి. — 57. శ్రీ సమయమంతుల రాధాకృష్ణరావు & బ్రదర్స్, ర్యాలి. — 58. శ్రీ మాతంశెట్టి జగ్గారావుగారు, ర్యాలి. 59. శ్రీ మాతంశెట్టి నాగరాజరావుగారు, ర్యాలి.— 60 శ్రీ సమయమంతుల వెంకటరత్నం నాగమ్మగార్లు & రామన్న మాణిక్యాంబగారి స్మారకముగ శ్రీ వెంకటసుబ్బారావుగారు, ర్యాలి — 61 శ్రీ సమయమంతుల జగన్న కుమారులు జగ్గారావు, బుచ్చిరాజు, వెంకటరత్నంగారు, ర్యాలి. — 62. శ్రీ మానేపల్లి వీరభద్రరావుగారు, ర్యాలి.

## గీతావాణి — పోషకవర్గము.

పశ్చిమగోదావరి జిల్లా: 63. శ్రీ ఆబోతుల రామన్నగారు, పాలకొల్లు. — 64. శ్రీ మామిడి సత్యనారాయణగారు, పాలకొల్లు.

నైజాం స్టేట్: 65. శ్రీ పి. వి. రంగారావుగారు, నల్గొండ. — 66. శ్రీ దేశముఖ్ వేనేపల్లి కొండలరావుగారు, నల్గొండ. — 67. శ్రీ నాగబండి విశ్వనాథంగారు, వరంగల్. — 68. శ్రీమతి చిదిరాల వీరలక్ష్మమ్మగారు, శ్రీ నృసింహ భక్తమండలి,వరంగల్. — 69. శ్రీ గండె రాజయ్యగారి లింగయ్యగారు, వరంగల్. — 70. శ్రీ తోటి కేదారిగారి చంద్రశేఖరంగారు, వరంగల్. — 71. శ్రీతాటికొండ నాగయ్యగారు, వరంగల్. — 72. శ్రీ పుల్లాది సూర్యనారాయణగారు, వరంగల్. — 73. శ్రీ మహూరు బసవలింగంగారు, వరంగల్. — 74. శ్రీ కొమరవెల్లి సూరయ్యగారు, వరంగల్. — 75. శ్రీయాదా నారాయణగారు, వరంగల్. — 76. శ్రీ గుని శెట్టి నాగలింగంగారు, వరంగల్. — 77. శ్రీ తోటి జగన్నాథంగారి ముక్తేశ్వర్ గారు, వరంగల్. — 78. శ్రీగన్ను బుచ్చయ్యగారు, వరంగల్. — 79. శ్రీమతి కామేశ్వరమ్మగారు c/o రవ్వా కైలాసంగారు, వరంగల్. — 80. శ్రీ సోమా నరసయ్యగారు, వరంగల్ — 81. శ్రీ వజినపెల్లి నరసయ్యగారు, వరంగల్ — 82. శ్రీ చండా పుల్లయ్యగారు, వరంగల్ — 83. శ్రీ చిదిరాల రాజశేఖరంగారు, వరంగల్ — 84. శ్రీ చెలుపూరు మంకయ్యగారు, వరంగల్.

మైసూర్ రాష్ట్రం: 85. శ్రీకాకుబాళ అంబణ్ణశ్రేష్ఠి అండ్ సన్స్‌వారు, హోస్పేట్ 86. శ్రీ వి. ఆర్. రాజగోపాల్ శ్రేష్ఠిగారు, బంగారుపేట. — 87. శ్రీ కె. ఆర్. సీతారామయ్యశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 88. శ్రీ కె. నంజప్పశ్రేష్ఠిగారు, బంగారుపేట. — 89. శ్రీ నారాయణమూర్తిగారు, c/o సూరా విరూపాక్షయ్యగారు, తొండేభావి. — 90. శ్రీ కె. చాడయ్యగారు, జమీందార్, మిణకనగుర్కి. — 91. శ్రీమతి కుసుమ భాగ్యలక్ష్మమ్మగారు, కంటోన్మెంట్, బెంగుళూర్.

మద్రాసు రాష్ట్రం: 92 శ్రీ శంకరనాయుడుగారు, కార్యూరు, నార్త్ ఆర్కాడు జిల్లా. — 93. శ్రీ సి. ఎస్. నాగరాజశ్రేష్ఠిగారు, కొళ్లేగాలం, కోయంబత్తూరుజిల్లా.

## అభిమానపోషకులు రు. 25

1. శ్రీ కోకా సాంబశివరావుగారు, మదరాసు-16.
2. శ్రీ గజ్జహళ్లి నాగిరెడ్డిగారు, వంపవాగలి, ఆలూరుతాలూకా. (కర్నూలు)
3. శ్రీమతి లంకా భాగీరథమ్మగారు, పొన్నమ్మగుడివీధి, చిత్తూరు.
4. కోనూరి సూరాయమ్మగారు, పెదిరేశ్వరం, తూర్పు గోదావరి.

---

Edited & Published by N. Shrikantam, Gulladurthy, Koilkuntla
Managing Editor: Swami Sri Ramakrishnananda, Vice-President
Sri Gita Sahitya Sevasamithi, Allagadda – Kurnool (Andhra)

ఓం

# భగవద్గీతమాతా.

రచయిత్రి _ కుమారి ఆర్. లక్ష్మీదేవమ్మగారు, చాగలమర్రి.

("జయహే జయహే జయజయ ఆంధ్రమాత" అను వరుస)

జయహే జయహే జయజయ గీతమాతా।
జయజయ గీతమాతా జయహే జయహే॥

1. ధర్మక్షేత్రం। కురుక్షేత్రం। పంచపాండవ। కురులసమూహం
నల్లని కృష్ణుని తీయనిమాటలా......॥నల్లని॥
మోదమొసగునమ్మా — మోక్షమొసగునమ్మా అ...

2. ఉత్సాహం। ఉపకారం। ప్రజ్ఞాసత్సంగం। సత్యంసమభావం।
ఘోరయుద్ధమున నీవిజయునకిడి
పేరుగాంచితమ్మా — నీ కిలలేరుసాటి సుమ్మా॥

3. భక్తిభావం। భాగ్యసంపద। వెలలేని నవరత్నద్వయములా
అన్నిదేశములా పంచిపెంచుమా
కన్నతల్లివమ్మా — ముక్తిమార్గమమ్మా॥

4. నల్లనికృష్ణుని నోటిమాటలో - వ్యాసమహర్షులచేతి కలములో
మర్మమెరుంగుము భగవద్గీతలో
మాటలుకావమ్మా! స్వర్గపు బాటలేను సుమ్మా!

5. భారతం। భాగోతం। రామాయణ। గీతా
వివిధగ్రంథ విశాల విరాజితాలు
తెనుగుదేశ ప్రకృతి నిరాజినులు.

6. గీతాఆశ్రమ కోటగోడలో - ప్రీతిగలహిందూహృదయములో
భక్తిగ శ్రద్ధగ భజనజేతురే! భగవద్గీతమాతా
భగవద్గీతమాతా! భగవద్గీతమాతా! భగవద్గీతమా....తా....

శ్రీవేదవ్యాస ప్రెస్, చిత్తూరు, ఫిబ్రవరి 1955 కా. 1000.